# శ్రీ అరవింద వ్యాసావళి








విందులు



## శ్రీ అరవింద వాఙ్మయము

| | | |
|---|---|---|
| ౧. | శ్రీ అరవిందోపన్యాసము | ౦- ౪-౦ |
| ౨. | శ్రీ అరవింద జీవితము | ౧- ౦-౦ |
| ౩. | శ్రీ అరవింద దర్శనము | ౧- ౦-౦ |
| ౪. | శ్రీ అరవింద లేఖలు | ౦. ౪-౦ |
| ౫. | శ్రీ అరవింద వ్యాసావళి | ౧- ౦-౦ |
| ౬. | జగన్మాత | ౦- ౬-౦ |
| ౭. | మాత వచనములు | ౦- ౪-౦ |
| ౮. | యోగదర్శిని | ౦- ౬-౦ |
| ౯. | యోగదీపికలు | ౦-౧౦-౦ |

పోస్టేజి వేఱు

చ. వేంకటకృష్ణయ్య
పుదుచ్చేరి (S. I. R.)

ప్ర కా శ కు ల గు

చతుర్వేదుల వేంకట కృష్ణయ్యగారిపేర

గ్రంథముయొక్క సమస్తహక్కులు రిజస్టరుచేయబడినవి.




వావిళ్లవారి ముద్రణాలయము

మద్రాసు.

Sri Aravinda Vyasavali

# శ్రీ అరవింద వ్యాసావళి

(వంగభాషనుండి అనువాదము)

అనువాదకులు

బ్రహ్మశ్రీ వేలూరి చంద్రశేఖరంగారు.

V Chandrasekharan




# విషయసూచిక

## ధర్మము: ౨—౧౦౦ పుటలు.

## జాతీయత: ౧౦౩—౧౯౪

# విన్నపము

శ్రీ అరవిందు లీ వ్యాసముల బ్రకటించి ముప్పది రెండేండ్లు గావచ్చినది. ఆలిపూరుబాంబు కేసులో నిర్దోషిగా తేలి విడుదలయైవచ్చినతరువాత ౧౯౦౯-వ సంవత్సరమున, ఆ నాటి రాచకీయ పరిస్థితులవలన విధిలేక తాత్కాలికముగా రాచకీయరంగమున బ్రవేశించియుండినపుడు, 'కర్మయోగిని' అను ఆంగ్లవారపత్రికతోబాటు 'ధర్మ' అను బంగాళీవారపత్రికను స్థాపించి నిర్వహించియుండిరి. ఆపత్రికలోని కొన్నివ్యాసములు 'ధర్మము మఱి జాతీయత' అనుపేర గ్రంథరూపమున బ్రకటితమై యున్నవి. ఆ బంగాళీగ్రంథమున కనువాదమే ఈగ్రంథము.

శ్రీఅరవిందులు ఇపుడు కేవల మొక్క యోగ సంబంధము తప్ప రాచకీయసంబంధము నేగాక మఱే యితర

సంబంధములనుగూడ బరిత్యజించిన విషయము మఱియు శ్రీఅరవిందాశ్రమమందు రాచకీయములు నిషేధ్యములను విషయము నంద ఱెఱింగినదే. కాని ౧౯౦౮-వ సంవత్స రారంభమున శ్రీ అరవిందులు యోగసిద్ధిని ఆత్మసాక్షాత్కారమును బడసినతరువాతనే ఈ వ్యాసముల రచియించి రనువిషయము పలువురకు తెలియకపోవచ్చును. సర్వత్ర సర్వేశ్వరునిదర్శించి సత్యమునెఱింగి ఆధ్యాత్మిక దృష్టితో ననేకసమస్యలనుగుఱించి శ్రీఅరవిందులు వెల్లడించియున్నారు. నేడును మనల నెదుర్కొని కలవరపఱుచు మత సాంఘిక రాచకీయాది సమస్యల యథారూపము గ్రహించుట కీవ్యాసము లుపకరించగలవను విశ్వాసముతో ఈగ్రంథమును ఆంధ్రలోకమున కందించుచున్నాను.

అనువాదకులగు బ్రహ్మశ్రీ వేలూరి చంద్రశేఖరం గారు తెలుగుసీమకు చిరపరిచితులు. శ్రీ అరవిందవాఙ్మయముగా నింతవఱకు నే బ్రకటించినగ్రంథములలో మూడు వా రనువదించినవే. శ్రీ అరవిందులపట్ల భక్తివిశ్వాసములు గల వీరు నా వేడికోలును మన్నించి ఈగ్రంథము ననువదించి

యిచ్చి సాయపడినందుల కెంతయు కృతజ్ఞుడను. సుప్రసిద్ధులగు వావిళ్లముద్రణాలయాధిపతులు, బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల్లుగారు, తమ ముద్రణాలయమున ఈ గ్రంథమును 'యోగదీపికలు' అను మఱొక గ్రంథమును తక్కువ రేట్లతో ముద్రింపించి సాయపడినందులకు నా కృతజ్ఞతావందనముల వారి కర్పించుకొనుచున్నాను.

ఇట్లు,
విధేయుడు
చ. వేంకటకృష్ణయ్య,
ప్రకాశకులు.

శ్రీ అరవిందాశ్రమం
పుదుచ్చేరి
తే ౨౪-౬-౪౦. ది



శ్రీ అరవిందులు

(౧౯౦౯ లో ఆలిపూరు బాంబుకేసులో నిర్దోషిగా తేలి విడుదలయై వచ్చినపుడు.)

# మన ధర్మము

మనధర్మము సనాతనధర్మము. ఈ ధర్మము మూఁడు విధములు; మూఁడు బాటలలో నడచుచున్నది; కర్మల మూఁడింటి యందు దాసక్తమై యున్నది. మనధర్మము మూఁడు విధములు. అంతరాత్మ యందును, మానసిక జగము నందును, స్థూలజగము నందును, ప్రకృతిచే సృజింపఁబడి మహాశక్తిచే నడిపింపఁబడు ఈ విశ్వరూపమున భగవంతుఁడు తన ఆత్మప్రకాశమును గావించుకొనియున్నాఁడు. ఈ మూఁడు స్థానములందును ఆతనితో సంయోగము బడయు ప్రయత్నమే సనాతనధర్మము యొక్క త్రివిధత్వము. మనధర్మము మూఁడు బాటలలో నడచుచున్నది. వేర్వేఱైనకాని లేక సమకూర్పఁబడినట్టికాని, జ్ఞాన–భక్తి – కర్మ లనఁబడు ఉపాయముల మూఁడింటిచే ఆ సంయోగావస్థ మనుష్యునకు సాధ్యము. ఈ ఉపాయముల

మూడింటివలన అంతఃశుద్ధిని సాధించి భగవంతునితో సంయోగమును బడయఁబోవుటయే సనాతనధర్మము యొక్క మూడు బాటల నడక. మన ధర్మము కర్మల మూడింటియం దాసక్తమై యున్నది. మనుష్యుని ప్రధాన వృత్తు లన్నింటి యందును మూడు ఊర్ధ్వమునకుఁ గొంపోవునవి, బ్రహ్మప్రాప్తి కవసరమైన బలము నిచ్చునవి; అవి సత్యము, ప్రేమ, శక్తి. ఈ మూడువృత్తుల వికాస ముచే మానవజాతియొక్క క్రమోన్నతి సాధింపఁబడుచు వచ్చుచున్నది. సత్య–ప్రేమ–శక్తుల ద్వారమున, పై మూడు బాటలందును ముమ్ముందునకు నడుచుటయే సనాతనధర్మముయొక్క కర్మత్రయము.

సనాతనధర్మమునందు అనేక గౌణధర్మములు నెల కొనియున్నవి. సనాతనము నూఁత చేసికొని, పరివర్తనశీలము లైన అనేక ధర్మములు, వివిధములైనవి—గొప్పవియును క్షుద్రములును—తమ తమ కార్యములందు మెలఁగు చున్నవి. అన్నివిధములైన ధర్మములకును కర్మలకును స్వభావమువలననే సృష్టి. సనాతనధర్మము జగముయొక్క

సనాతన స్వభావముపై నెలకొల్పఁబడినట్టిది. మఱియు ఈ వివిధధర్మములును వివిధములైన ఆధారములయొక్క స్వభావముల ననుసరించి యేర్పడినవి. వ్యక్తిగతధర్మము, జాతిధర్మము, యుగధర్మము ఈ విధముగా అనేకధర్మములు గలవు. అనిత్యములని ఈ యవి ఉపేక్షింపఁ దగినవి కావు, వర్జింపఁదగినవి కావు; ప్రత్యుత అనిత్యములును పరివర్తనశీలములును అగు ధర్మములద్వారముననే సనాతన ధర్మము వికసించుచున్నది, అనుష్ఠితమగుచున్నది. వ్యక్తిగతధర్మము, జాతిధర్మము, వర్ణాశ్రితధర్మము, యుగధర్మము అను వీనిని పరిత్యజించినచో సనాతనధర్మమునకు పుష్టి కలుగకపోవుటయే గాక, అధర్మమే వృద్ధిపొందును. మఱియు గీత యం దేది సంకరమని పేర్కొనఁబడి యున్నదో, అనఁగా సనాతనప్రణాళికి భంగము, క్రమోన్నతికి ప్రతీపగతి, ఇది పాపముచేతను అత్యాచారము చేతను వసుంధరను దగ్ధము చేసివైచును. ఈపాపము యొక్కయు అత్యాచారముయొక్కయు పరిమితి మిక్కుటముకాఁగా, మానవోన్నతికి శత్రువులై ధర్మమును చెండాడు ఆసురశక్తుల మూఁక క్రొవ్వి బలుపుచెంది

ఎపుడు స్వార్థ క్రౌర్యాహంకారములతో దశదిశలను కప్పివైచునో, మఱియు అనీశ్వరమైపోయిన జగమునం దీశ్వర వేషమును దాల్చుట కారంభించునో, అపుడు దుఃఖముచే క్రుంగిపోయెడు పృథివియొక్క భారమును తగ్గించు తలఁపుతో భగవంతుని అవతారమో విభూతియో మానవదేహమునందు వెలువడి మరల ధర్మపథమును నిష్కంటక మొనర్చును.

సనాతనధర్మమును యథార్థముగా పరిపాలింపవలె నన్న; వ్యక్తిగత ధర్మము, జాతి ధర్మము, వర్ణాశ్రమ ధర్మము, యుగ ధర్మము వీని ఆచరణము నెల్లపుడును కాపాడవలయును. కాని ఈ వివిధధర్మములలో ఎక్కువయు తక్కువయు అను రెండు తెఱఁగులు గలవు. ఎక్కువధర్మముతో తక్కువదానిని మేళవించియు సంశోధన మొనరించియు అనుష్ఠించుట శ్రేయస్కరము. ఎట్లన, వ్యక్తిగతధర్మమును జాతిధర్మముయొక్క అంకమునందు నెలకొల్పి ఆచరింపనిచో, జాతి భగ్నమై పోవును; ఇఁక జాతిధర్మము లుప్తమైనచో వ్యక్తిగతధర్మమునకే క్షేత్ర

మును అవకాశమును నష్టమైపోవును. ఇదియును ధర్మ సంకరమే; ఇట్టిసంకరముయొక్క ప్రభావముచేతఁ గూడ జాతియు సంకరకారులును అతల నరకమునఁ బడిపోవుదురు. జాతిని మొదట రక్షింపవలయును; అప్పుడే వ్యక్తియొక్క ఆధ్యాత్మికమును, నైతికమును, ఆర్థికమును అగు ఉన్నతిని నిరాపదముగా రక్షింప వీలగును. మఱియు వర్ణాశ్రితధర్మ మునుగూడ యుగధర్మముయొక్క మూసయందు కరిగి పోసి నిర్మింప సమర్థులము కామేని, మహత్తరమగు యుగ ధర్మముయొక్క ప్రతికూలగతిచే వర్ణాశ్రితధర్మము తుత్తు మురై వినష్టమై పోఁగా, సమాజమును అట్లే తుత్తుమురై వినష్టమగును. తక్కువ ధర్మ మెల్లపుడును ఎక్కువ ధర్మ మునకు అంశమో సహాయకమో అగుచుండును. ఈ సంబంధమునకు తాఱుమాఱు సంఘటిల్లుచో, ధర్మసంకర ముచే సంభవించెడు మహానర్థము వాటిల్లుచున్నది. తక్కువ ధర్మమునకును ఎక్కువధర్మమునకును విరోధము జనించెనేని, తక్కువధర్మమును బరిత్యజించి ఎక్కువధర్మము ననుష్ఠించుట మంగళప్రదము.

మా యుద్దేశ్యము సనాతనధర్మమును ప్రచారము చేయుట, మఱియు సనాతనధర్మము నాశ్రయించిన జాతి యుగధర్మముల ననుష్ఠించుట. మనము భారతవాసులము, ఆర్యజాతియొక్క వంశీయులము, ఆర్యశిక్షకును ఆర్యనీతి కిని అధికారులము. మన కులధర్మమును జాతిధర్మమును ఈ ఆర్యభావమే. జ్ఞాన-భక్తి-నిష్కామకర్మలు ఆర్య శిక్షకు మూలము. జ్ఞానము, ఉదారత, ప్రేమ, సాహసము, శక్తి, వినయము ఇవి ఆర్యచారిత్రముయొక్క లక్షణ ములు. మానవజాతికి జ్ఞానమును వితరణచేయుట, జగతికి ఉన్నతోదారమైన చారిత్రము విషయమున నిష్కళంక ములైన ఆదర్శముల నొసఁగుట, దుర్బలుల రక్షించుట, ప్రబ లులైన అత్యాచారులను శాసించుట ఆర్యజాతియొక్క జీవన మున కుద్దేశ్యములు. ఆ ఉద్దేశ్యములను సాధించుటయందే ఆర్యధర్మముయొక్క చరితార్థత. మనము ధర్మభ్రష్టులము, లక్ష్యభ్రష్టులము; ధర్మసంకరమునందును భ్రాంతిసంకులమైన తామసికమోహమునందును పడి ఆర్యులశిక్షానీతులను పోఁ గొట్టుకొంటిమి. మనము ఆర్యజాతియయ్యును శూద్రత్వ మును శూద్రధర్మస్వరూపమైన దాసత్వమును అంగీకరించి,

జగతియందు హేయులమై, ప్రబలులయొక్క పదముల క్రింద మట్టగింపఁబడి, దుఃఖపరంపరలయందు పీడింపఁబడు చున్నాము. కావున,మనము బ్రతుకవలయునేని, అనంత నరకమునుండి ముక్తిబడయుటకు లేశమాత్రమైన అభిలాష మన కుండెనేని, జాతిని రక్షించుట మన ప్రథమకర్తవ్యము. జాతిని రక్షించుట కుపాయము ఆర్యచారిత్రమును మరల నిర్మించుట. దేనివలన జననియగు జన్మభూమియొక్క భావి సంతానము జ్ఞానవంతము, సత్యనిష్ఠము, మానవప్రేమ పూర్ణము, భ్రాతృభావభావితము, సాహసయుక్తము, శక్తి మంతము, వినీతము నగునో అట్టిశిక్షను, ఉచ్చమైన ఆదర్శములను, మఱియు ఆర్యభావోద్దీపకమైన కర్మప్రణాళిని సమస్తజాతికిని ముఖ్యముగా యువకులకును ఇచ్చుట మా ప్రథమోద్దేశ్యము. ఈ కార్యమునందు కృతార్థులము కానంతవఱకును సనాతన ధర్మప్రచారము ఊషరక్షేత్రమునందు విత్తులను వెదచల్లుట మాత్రమే యగును.

జాతిధర్మము ననుష్ఠించుటచే యుగధర్మమును సేవించుట సులభముగా సాధ్య మగును. ఈ యుగము శక్తియొక్కయు ప్రేమయొక్కయు యుగము. కలి ప్రారం

భింపఁగా జ్ఞానకర్మములు భక్తి కధీనములును సహాయకములును అయినవై తమ ప్రవృత్తులను చరితార్థ మొనర్చుకొనును; సత్యమును శక్తియును ప్రేమ నాశ్రయించి మానవజాతియందు ప్రేమను వికసింపఁజేయ యత్నపడును. బౌద్ధధర్మముయొక్క మైత్రీదయలును, క్రైస్తవధర్మముయొక్క ప్రేమశిక్షయు, ముసల్మానుధర్మముయొక్క సామ్యభ్రాతృత్వములును, పౌరాణికధర్మముయొక్క భక్తిప్రేమములును ఈ ప్రయత్నముయొక్క ఫలితములు. కలియుగమున సనాతనధర్మము మైత్రి, కర్మ, భక్తి, ప్రేమ, సామ్యము, భ్రాతృభావము అను వీని సాహాయ్యమును గైకొని మానవుల కల్యాణమును సాధించును. జ్ఞాన భక్తి నిష్కామకర్మలచే నిర్మితమైన ఆర్యధర్మమునందు ఈ సకల శక్తులును ప్రవేశించి, వికసించి, తమతమ ప్రవృత్తుల నెఱవేఱికకై తమ విస్తృతికై మార్గమును వెదకుకొనుచున్నవి. శక్తి ఉదయింప నుండుటకు లక్షణములు కఠినమైన తపస్య, ఉచ్చమైన ఆకాంక్ష, ఉదారమైన కర్మ. ఎప్పుడీ జాతి తపస్వి యగునో, ఉచ్చమైన ఆకాంక్షయందు ప్రవర్తిలునో, ఉదారమైన కర్మయందు ప్రయాసపడునో

అపుడు జగముయొక్క సౌభాగ్యపు దినము లారంభ మయ్యెననియు, ధర్మవిరోధకమైన ఆసురిక శక్తికి పతనమును దేవ శక్తికి పునరుత్థానమును అవశ్యం భావియనియు ఎఱుఁగ నగును. కావున ఈ లక్షణముల ననుసరించు శిక్షయు ప్రస్తుత మవసరము.

యుగధర్మ జాతిధర్మములు సాధింపఁబడెనేని జగ మం దంతటను సనాతనధర్మము నిరాటంకముగా ప్రచారముచేయఁబడిన దగును, అనుష్ఠింపఁబడిన దగును. పూర్వ కాలమునుండియు విధాతచే ఏది నిర్దేశింపఁబడెనో, దేని సంబంధమున భవిష్యోక్తి శాస్త్రమునందు వ్రాయఁబడి యున్నదో, అదియును కార్యరూపమున అనుభూతము కాఁగలదు. సమస్తజగమును ఆర్యదేశమున జనించిన బ్రహ్మజ్ఞానులకడ జ్ఞానధర్మశిక్షలను బడయఁగోరినదై భారత భూమిని తీర్థముగఁ గైకొని, అవనతమస్తకముతో దాని ప్రాధాన్యమును స్వీకరించును. ఆ దినమును గైకొనివచ్చుటకై భారతవాసుల జాగరణము, ఆర్యభావముయొక్క నవోత్థానము.

---

# గీతా ధర్మము

గీతను శ్రద్ధతోఁ జదివినవారల మనసునందు బహుశః ఈప్రశ్న ఉత్థితము కావచ్చును:—శ్రీకృష్ణ భగవానుఁడు మాటిమాటికిని యోగశబ్దమును వ్యవహరించుటయు యుక్తావస్థను వర్ణించుటయు కలదుగదా, ఏల ఈయోగము సాధారణముగా లోకమున యోగమని పేర్కొనఁబడుదానితో సరిపోకున్నది?—అని. శ్రీకృష్ణుఁ డచ్చటచ్చట సన్యాసమును ప్రశంసించినాఁడు, అనిర్దేశ్యమగు పరబ్రహ్మముయొక్క ఉపాసనకు ఫలముగా పరమగతియు నిర్దేశించినాఁడు. కాని దానిని బహుసంక్షిప్తముగా సమాప్త మొనర్చి, గీతయొక్క అధికభాగమునందు త్యాగముయొక్క మహత్త్వము, వాసుదేవునియెడ శ్రద్ధ వలనను ఆత్మసమర్పణమువలనను పరమగతిప్రాప్తి వీనిని వివిధోపాయములచే అర్జునునకు బోధించినాఁడు. ఆరవ

అధ్యాయమందు రాజయోగ మించుక వర్ణించఁబడినది. కాని గీతను రాజయోగమును దెల్పు గ్రంథమని చెప్పుటకు వీలులేదు. సమత, అనాసక్తి, కర్మఫలత్యాగము, శ్రీకృష్ణు నెడ సంపూర్ణమైన ఆత్మసమర్పణము, నిష్కామ కర్మ, గుణాతీతత్వము, మఱియు స్వధర్మసేవ, ఇవియే గీత యొక్క మూలతత్త్వములు. ఈశిక్షణము నే భగవంతుఁడు పరమజ్ఞానమనియు గూఢతమరహస్య మనియు కీర్తించినాఁడు. మా నమ్మకము గీతయే జగతియొక్క భావిధర్మమునకు సర్వజనసమ్మతమైన శాస్త్రము కాఁ గలదని. కాని గీతయొక్క నిజమైన ధర్మము ఎల్లరకును బోధపడుట లేదు. గొప్పగొప్పపండితులు, ఉత్తములైన మేధావులు,తీక్ష్ణ బుద్ధిగల లేఖకులు వీరుగూడ దీనియొక్క గూఢార్థమును గ్రహించువిషయమున సమర్థులు కాకున్నారు. ఒకవైపున మోక్షైకపరాయణులగు వ్యాఖ్యాకారులు గీతయందు అద్వైతవాదమును సన్న్యాసధర్మముఁయొక్క శ్రేష్ఠత్వమును వీక్షించినారు. మఱొకవైపున ఆంగ్లేయదర్శన పారంగతుఁడైన బంకిమచంద్రుఁడు కేవలము వీరభావముతో కర్తవ్యము ను పరిపాలించుట మాత్రమే గీతయం దుపదేశింపఁ

బడినదని గ్రహించి, ఆ అర్థమునే యువజనుల మనము నందు నాటఁజేయయత్నించినాఁడు. సన్న్యాసధర్మము చాల మేటి ధర్మ మనుటయందు సందేహములేదు. కాని ఆధర్మ మును చాల కొలఁదిమంది మాత్రమే ఆచరింపఁగలరు. ధర్మము సర్వజనసమ్మత మగుటకై, దాని ఆదర్శమును తత్త్వశిక్షయు సర్వసాధారణముగా ఎల్లరును తమతమ జీవితములందును కర్మక్షేత్రములందును అందుబాటుచేసి కొనుటకు వీలై యుండవలెను. మఱియును ఆ ఆదర్శమును సంపూర్ణముగా ఆచరించుటవలన, అల్పజన సాధ్యమనఁబడు ఆ పరమగతియు ప్రాప్తము కావలయును. వీరభావముతో కర్తవ్యమును పాలించుట గొప్పధర్మమనుట నిజమే; కాని కర్తవ్యమేమి అను ఈ జటిలప్రశ్నతో మతమునందును నీతియందును ఎంతయో సంకటము. "కర్మగతి గహనము; కర్తవ్య మేది, అకర్తవ్య మేది; ఏది కర్మ, ఏది అకర్మ, మఱియు ఏది వికర్మ; ఇది నిర్ణయించుపట్టున జ్ఞానులును విమోహితులగుచున్నారు. కాని, ఏజ్ఞానముచే గంతవ్య పథము సులభముగా నిర్ణీత మగునో, కర్మజీవనము యొక్క లక్ష్యమును, నిత్యమును అనుష్ఠింపఁ దగిన

నియమములును సుస్పష్టముగా నొక్కమాటలో వ్యా ఖ్యాతమగునో అట్టిజ్ఞానము నీ కిత్తును.” అని భగ వంతుఁడు పలికినాఁడు. ఈజ్ఞాన మేది? వేనవేలమాటల సారమైన ఈ ఒక్కమాటను ఎచ్చట పట్టుకొందుము? గీతయొక్క కడపటి అధ్యాయమందు భగవంతుఁ డెచ్చట తన గుహ్యతమమైన పరమవచనమును అర్జునునకు తెలు పుదునని వాగ్దాన మొనరించెనో, అచ్చటనే ఈ దుర్లభమును అమూల్యమును అగు వస్తువు వెదకినచో దొరకఁగలదని మా విశ్వాసము. సర్వగుహ్యతమమైన ఆపరమవచన మేది?

“మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ [చః”.
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశు

ఈ రెండు శ్లోకముల యర్థమును ఒక్కమాటలో తెలుపవచ్చును. ఆమాట ఆత్మసమర్పణము. ఎవ్వఁడే పరి మాణమున శ్రీకృష్ణునికడ ఆత్మ సమర్పణ మొనర్ప నేర్చు నో, అతని శరీరమున అంత పరిమాణమున భగవద్దత్తమైన

శక్తి ప్రవేశించి, పరమమంగళమయుఁడైన భగవంతుని ప్రసాదముచే దానిని పాపవిముక్త మొనర్చి దేవభావ మును బడయఁజేయును. ఈ ఆత్మసమర్పణము మొదటి శ్లోకముయొక్క మొదటిపంక్తియందు వర్ణింపఁబడినది. తన్మనస్కుఁడును తద్భక్తుఁడును తద్యాజియును కావల యును. తన్మనస్కుఁడనఁగా సర్వభూతములందును ఆతనిని దర్శించుట, సర్వకాలములందును ఆతనిని స్మరించుట, సర్వ కార్యములందును సర్వఘటనములందును ఆతని శక్తిజ్ఞాన ప్రేమముల ఖేలను వీక్షించి పరమానందమున నిలిచియుం డుట. తద్భక్తుఁడనగా ఆతనిపై సంపూర్ణమైన శ్రద్ధా ప్రేమముల నిల్పి ఆతనితో కలిసియుండుట. తద్యాజి యనఁగా అల్పములును అనల్పములును ఐన సర్వకర్మము లును శ్రీకృష్ణు నుద్దేశించి యజ్ఞభావముతో సమర్పించుట, మఱియు స్వార్థమునందును కర్మఫలమునందును ఆసక్తిని వీడి భగవదర్థమే కర్తవ్యమగు కర్మయందు మెలఁగుట. మానవునిపక్షమున సంపూర్ణమైన ఆత్మసమర్పణము కఠినము. కాని ఇంచుక ప్రయత్నము చేసినచో స్వయముగా భగ వానుఁడే గురువును, రక్షకుఁడును, నెచ్చెలియు నై అభయ

దాన మొసఁగి యోగపథమున మనలను ముమ్ముందునకు నడపును. 'స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్'. ఈ ధర్మము నాచరించుట సులభమనియు సుఖప్రదమనియు ఆతఁడు పలికినాఁడు. అది యథార్థముగా నట్లే; మఱియు సంపూర్ణాచరణముయొక్క ఫలము అనిర్వచనీయమైన ఆనందము, శుద్ధి, శక్తిలాభము. "మామేవైష్యసి"—అనఁగా, నన్నుఁ జేరుదువు, నాతో వసింతువు, నా ప్రకృతిని బడయుదువు. ఈ మాటయందు సాదృశ్యము, సాలోక్యము, సాయుజ్యము అను ఫలముల యొక్క ప్రాప్తి తెలుపఁబడినది. ఎవఁడు గుణాతీతుఁడో అతఁడు భగవంతుని సాదృశ్యమును బడయును. ఆతని కే ఆసక్తియును లేదు, అయినను కర్మ నాచరించును. పాపవిముక్తుఁడై మహాశక్తికి ఆధార మగును. ఆ శక్తి యొక్క సర్వకార్యములందును ఆనందించును. దేహము పడిపోయిన పై బ్రహ్మలోకమును జేరుటయే సాలోక్యము కాదు. ఈ శరీమందును సాలోక్యము సిద్ధించును. దేహయుక్తుఁడైన జీవుఁ డెప్పుడు తన స్వాంతమందు పరమేశ్వరునితో క్రీడించునో, మనసు ఆతనిచే ఈయఁ

బడిన జ్ఞానముతో పులకితమగునో, హృదయ మాతని ప్రేమస్పర్శచే ఆనంద సంప్లుతమగునో, బుద్ధి మాటిమాటికిని ఆతనిపలుకును వినునో, మఱియు ప్రతితలంపునందును ఆతనిప్రేరణయే అనుభూత మగునో ఆ స్థితియే మానవ శరీరమునందు భగవంతునితోడి సాలోక్యము. సాయుజ్య మును ఈశరీరమునందు ఘటించును. భగవంతునియందు నివసించుటనుగూర్చి గీతయందు చెప్పఁబడియున్నది. సర్వ జీవములందును ఆతఁడే అను నుపలబ్ధి ఎపుడు స్థిర ముగా నిలుచునో, ఇంద్రియములు ఎపుడు ఆతనినే చూచునో, వినునో, ఆఘ్రాణించునో, ఆస్వాదించునో, స్పృశించునో, జీవుఁ డెల్లపుడును ఆతనియందు అంశియై నిలువనేర్చుట నభ్యసించునో, అప్పు డీ శరీరమునందును సాయుజ్యము ఘటించును. సంపూర్ణమైన అనుశీలనకు ఫలముగా ఈ పరమగతి ప్రాప్తించును. కాని ఈ ధర్మము నించుక ఆచరించినను, గొప్పశక్తి, విమలమైన ఆనందము, పూర్ణమైనసుఖము, విశుద్ధి వీనిని బడయవచ్చును. ఈ ధర్మము విశిష్టగుణసంపన్నులైన కొందఱికి మాత్రమే సృ ష్టింపఁబడ లేదు. బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు,

శూద్రుఁడు, పురుషులు, స్త్రీలు మఱియు పాపయోనులైన సకలజీవులును ఈ ధర్మము ద్వారమున ఆతనిని బడయఁ గలరు. ఘోరపాపులును ఆతని శరణుజొచ్చి స్వల్పకాలములో విశుద్ధు లగుదురు. కావుననే ఈధర్మము ఎల్లరకును ఆచరణీయము. జగన్నాథు నాలయమునందు జాతివిచారణ లేదు. మఱియును దీనిఫలితమైన పరమగతి మఱే ఏ ధర్మముచేత నిర్దేశింపఁబడిన పరమగతికిని తీసిపోదు.

---

# సన్యాసము, త్యాగము

గీతయందు తెలుపఁబడిన ధర్మము సకలజనులకును ఆచరింపఁదగిన దనియు, గీతయందు తెలుపఁబడిన యోగమునకు సకలజనులును అధికారు లనియు, మఱియు ఈ ధర్మముయొక్క గమ్యము వేఱే ధర్మముయొక్క గమ్యమునకును తీసిపోదనియు వెనుకటి వ్యాసమునందు చెప్పఁబడినది. నిష్కామముగా కర్మ నాచరించుధర్మము గీతోక్త ధర్మము. మనదేశమున ఆర్యధర్మమును మరల నుద్ధరించు ప్రయత్నముతోపాటు సన్యాసోన్ముఖత్వముకూడ ప్రవాహమువలె దేశమంతటను వ్యాపించినది. రాజయోగమభ్యసించువారి చిత్తము గృహకర్మయందుఁ గాని గృహవాసమునందు గాని సహజముగా సంతుష్టమై యుండఁజాలదు. వారల యోగాభ్యాసమున ధ్యానధారణలతోఁ గూడిన బహు లాయాసపూర్ణమైన ప్రయత్న మావశ్య

కము. మనస్సునకు స్వల్పమైన చికాకుచేఁ గాని, లేక బాహ్యస్పర్శలవలనఁ గాని ధ్యానధారణలయొక్క స్థిరత్వము తొలఁగిపోవును; ఒకట సంపూర్ణముగా నశించును. గృహమం దిట్టి యభ్యంతరములు మిక్కుటముగాఁ గలవు. కావుననే ఎవరు పూర్వజన్మప్రాప్తమైన యోగలిప్సతో జన్మింతురో వారు తరుణవయస్సునందే సన్యాసమువైపున కాకర్షింపఁబడుట మిక్కిలి స్వాభావికము. ఎప్పు డిట్టిజన్మప్రాప్తమైన యోగలిప్స గలవారల సంఖ్య అధికమై, దేశమంతటను వారల శక్తియొక్క ప్రసారముచే యువసమాజమునందు సన్యాసప్రవణత ప్రబల మగునో, అపుడు దేశముయొక్క కల్యాణపథమునకు ద్వారము తెఱవఁబడును; కాని ఆ శుభముతో మిళితమై ఆపదయొక్క ఆశంకయుఁ గలదు. సన్యాసధర్మ ముత్కృష్టధర్మ మనియు, ఆధర్మమును గ్రహించుటకు కొలఁదిమందియే అధికారులనియు నిదివఱకే చెప్పఁబడినది. ఎవరు అధికారము లేకయే ఆబాటపై ప్రవేశింతురో వారు కడపటకు అల్పదూరముమాత్రమే నడచినవారై, సగముబాటలో తామసికమును అప్రవృత్తిజనకమును అగు ఆనందమున కధీనులై

నివృత్తులగుదురు. ఈ స్థితియందు ఇహజీవనము సుఖముగా గడచుట నిస్సంశయము. కాని జగమునకు హితముచేయుటయు సాధింపఁబడదు, యోగముయొక్క ఊర్ధ్వతమ సోపానము నారోహించుటయు సాధ్యము కాని దగును. ఇపుడు మనపైఁబడిన ఈ కాలస్థితియందు ప్రధాన కర్తవ్య మేమన, రజఃసత్త్వములను అనఁగా ప్రవృత్తి జ్ఞానములను మేల్కొలిపి, తమోగుణమును బారఁద్రోలి, జాతియొక్క ఆధ్యాత్మికశక్తియు నైతికబలమును దేశసేవవలనను జగత్సేవవలనను మరల సజీవమగునట్లు కావించుట. జీర్ణశీర్ణమును, తమఃపీడితమును, స్వార్థసీమాబద్ధమును అయిన ఈజాతియొక్క గర్భమునందు జ్ఞానవంతమును, శక్తిమంతమును, ఉదారమును అగు ఆర్యసంతతిని మరల సృష్టింపవలయును. ఈ ఉద్దేశమును సాధించుకొఱకే వంగదేశమందు శక్తివిశిష్టులును యోగబలమును బడసినవారును అగు నిందఱు జీవులు జన్మించుచున్నారు. వీరు సన్యాసముయొక్క విమోహనశక్తిచే ఆకర్షింపఁబడి, స్వధర్మమును త్యజించి ఈశ్వరదత్తమైన కార్యమును ప్రత్యాఖ్యానముచేసిరేని, ధర్మ

నాశమును జాతిధ్వంసమును ఘటింపఁగలవు. యువజను లీక్రిందివిషయములను హృదయమున నిల్పుకొందురుగాక. బ్రహ్మచర్యాశ్రమము శిక్షణముకొఱకును చారిత్రము యొక్క నిర్మితికొఱకును నిర్దేశింపఁబడిన సమయము. ఈ ఆశ్రమమునకు తరువాతదశయందు గృహస్థాశ్రమము విధింపఁబడినది. కులరక్షణముగావించియు భవిష్యదార్య జాతిని నిర్మించుట కనువుపడియు ఎపుడు పూర్వపురుషుల ఋణమునుండి విముక్తుల మగుదుమో, సత్కార్యముల నాచరించియు ధనసంచయము గావించియు ఎపుడు సమాజముయొక్క ఋణమునుండి విముక్తుల మగుదుమో, ఎపుడు జ్ఞాన దయా ప్రేమ శక్తులను వెదచల్లి జగము యొక్క ఋణము నుండి విముక్తుల మగుదుమో, భారత జననియొక్క హితముకొఱకు సాధింపఁబడిన ఉదారమైన మహాకార్యములచే ఎపుడు జగన్మాత సంతుష్టురాలగునో, అపుడు వానప్రస్థమును సన్యాసమును స్వీకరించుట దోషావహము కానేరదు. కాదేని ధర్మసంకరమునకును అధర్మమునకును వృద్ధిచేకూరును. పూర్వజన్మమునందే ఋణ విముక్తులయిన బాలసన్యాసులవిషయము నేను చెప్పుట

లేదు. కాని అనధికారులు సన్న్యాసమును గ్రహించుట నిందింపఁదగినది. మేటిదియును ఉదారమును అగు బౌద్ధ ధర్మము దేశమునకు చాలహితముచేసియు, అయథార్థ మైన వైరాగ్యమును పెంపుచేయుటచేతను, క్షత్త్రియు లందు స్వధర్మత్యాగప్రవణతను ప్రబలముచేయుటచేతను అపకారమును గూడ కల్గించినదై, కడకు భారతమునుం డియే తఱిమివేయఁబడెను. నవయుగముయొక్క నవీన ధర్మమునందు ఈ దోషము ప్రవేశింపకుండుఁగాక.

గీతయందు శ్రీకృష్ణుఁడు మాటిమాటికిని అర్జునుని సన్న్యాసాచరణమునుండి ఏల వారించెను? ఆతఁడు సన్న్యాస ధర్మముయొక్క గొప్పతనము నంగీకరించెను; కాని వైరా గ్యమునకును జాలికిని వశపడినపార్థుఁడు పలుమారులు ప్రశ్నించినను, శ్రీకృష్ణుఁడు తనకర్మమార్గముయొక్క ఆదేశ మును ఉపసంహరించుకొనఁడయ్యెను. అర్జునుఁడు ప్రశ్నిం చెను—కర్మకంటె కామనా రహితమైనట్టియు యోగ యుక్తమైనట్టియు బుద్ధి శ్రేష్ఠ మగునేని, గురుజన హత్యా రూపమును పరమభీషణమును అగు ఈకర్మయందు న

న్నేటికి నియోగించుచున్నావు? అనేకులు అర్జునుని ప్రశ్నను మరల లేవనెత్తినారు. కొందఱు కొందఱు శ్రీ కృష్ణుఁడు నికృష్టధర్మము నుపదేశించె ననియు, కుపథము నకే ప్రవర్తకుఁడయ్యె ననియు చెప్పుటకుకూడ వెనుదీయ లేదు. శ్రీకృష్ణుఁడు తన ప్రత్యుత్తరమందు ఈ విధముగా తెలియఁజెప్పెను: సన్న్యాసముకంటె త్యాగము శ్రేష్ఠము; మఱియు తనయిచ్చవచ్చిన కర్మనాచరించుటకంటె భగవత్స్మరణ పూర్వకముగా నిష్కామభావముతో స్వధర్మ మును సేవించుటయే శ్రేష్ఠము. త్యాగ మనఁగా కామ నను త్యజించుట, స్వార్థమును త్యజించుట. ఈ త్యాగ మును నేర్చుకొఱకై పర్వతమందుఁ గాని నిర్జనప్రదేశ మునఁ గాని వసియింపఁ బనిలేదు. కర్మక్షేత్రముననే, కర్మ ద్వారముననే ఈ నేర్పుట వీలుపడును. కర్మయే యోగ పథమునం దారోహించుట కుపాయము. విచిత్రమును లీలామయమును అగు నీజగము జీవుని ఆనందమునకై సృజింపఁబడినది. ఆనందమయమగు నీ క్రీడ ముగింపఁబడుఁ గాక యని భగవ దుద్దేశ్యము కాదు. ఆతఁడు జీవుని నెచ్చెలిఁగా, తోడి ఆటకానిఁగాఁ గైకొని, జగము నం

దానందముయొక్క వెల్లువను ప్రవహింపఁ జేయఁగోరును. మన మే అజ్ఞానాంధకారమున మునిఁగియున్నామో, అది ఆటయొక్క వీలుకొఱకై ఆతఁడు దూరమునం దుండుట చేతనే కలుగుచున్నది. ఈ అంధకారమునుండి బయల్పడి ఆతని సాన్నిధ్యమును బడయఁగోరుదుమేని, ఆతనిచే నిర్దేశింపఁబడిన ఉపాయము లనేకములు మన అవలంబము నకై కలవు. ఎవ్వ రాతని క్రీడయందు విరక్తులో, ఎవ్వరికి విశ్రాంతి వలయునో, వారల యభిలాష నాతఁడు పూరించును. కాని కేవలము భగవంతునినిమిత్తమే ఆ యుపాయముల నెవ్వరవలంబింతురో, వారినిమాత్రమే భగవంతుఁడు ఇహలోకమునఁగాని పరలోకమునఁగాని తన ఖేల కుపయుక్తులైన నెచ్చెలులఁగా నొనరించును. అర్జునుఁడు శ్రీకృష్ణునకు సఖుఁడును క్రీడాసహచరుఁడును అను హేతువుచేతనే గీతయొక్క గూఢతమమైన బోధను బడయఁగల్గెను. ఆ గూఢతమమైన బోధ యేదో ఆవిషయము గతవ్యాసమున దెల్పుటకు యత్నించితిమి. భగవంతుఁ డర్జునునకు దెల్పిన దిది. కర్మసన్న్యాసము జగమున కనిష్టకరము; మఱియు త్యాగహీనమైన సన్న్యాసము విడం

బనమాత్రము. సన్యాసమువలన ఏ ఫలప్రాప్తియో త్యాగ
మువలన ఆఫలప్రాప్తియే; అనఁగా, అజ్ఞానమునుండి ముక్తి,
సమత, శక్తిలాభము, ఆనందలాభము, శ్రీకృష్ణలాభము.
సర్వజనులచే సమ్మానింపఁబడు పురుషుఁడు దేని నాచరిం
చునో దానినే లోకు లాదర్శముగాఁ గైకొని ఆచరింతురు.
కావున నీవు కర్మను సన్యసించితివేని, ఎల్లరును ఆబాటనే
త్రొక్కి ధర్మమునకు సంకరమును అధర్మమునకు ప్రాబల్య
మును కల్పింతురు. నీవు కర్మఫలమునందలి స్పృహవీడి,
మానవులకు సాధారణమైనధర్మమేదో దాని నాచరింపుము.
ఆదర్శస్వరూపుఁడవై, ఎల్లరును తమ తమ కర్మమార్గము
లందు ముందునకు నడచి పోవునట్లు ప్రేరణ నొసంగుము.
అట్లైనచో నా సాధర్మ్యమును ప్రాపింతువు. నాకు ప్రియతే
ముఁడవైన నెచ్చెలి వగుదువు అటుపై మఱియు నీవిధ
మున బోధించెను. కర్మద్వారమున శ్రేయఃపథము నం దా
రూఢుఁడ వగుము. ఆపథముయొక్క శేషదశయందు
శమము అనఁగా సర్వారంభపరిత్యాగము విధింపఁబడు
చున్నది. ఇదియును కర్మసన్యాసముకాదు. అహంకారమును
వర్జించి, బహుళాయాసపూర్ణమైన రాజసికచేష్టను బరిత్య

జించి, భగవంతునితో యుక్తుఁ డగుట; గుణాతీతుఁడై, ఆతని శక్తిచే నడుపఁబడి, యంత్రముబోలె కర్మ నాచరించుట. "నేను కర్తను గాను, నేను ద్రష్టను. నేను భగవంతుని అంశమును. మన స్వభావమును రచించినదియు, దేహరూపమును కర్మమయమును అయిన ఈ ఆధారమునందు భగవంతుని శక్తియే తనలీలయొక్క కార్యములను జరుపుచున్నది; జీవుఁడు సాక్షియు భోక్తయు; కర్త ప్రకృతి; పరమేశ్వరుఁ డనుమంత"— అను స్థిరజ్ఞానము ఈ పైఁ దెల్పిన దశయందు కల్గుచున్నది. ఈ జ్ఞానమును చేరిన పురుషుఁడు శక్తియొక్క ఏ కార్యారంభమునందును స్వకామనా ప్రేరితుఁడై సాయపడుటకుఁగాని అడ్డపడుటకుఁగాని యిచ్ఛగింపఁడు. శక్త్యధీనములై దేహ మనోబుద్ధులు ఈశ్వరాదిష్టమైన కర్మయందు ప్రవర్తించును. కురుక్షేత్రముయొక్క భయంకరమైన హత్యాకాండయు భగవంతునిచే అనుమతింపఁబడునేని, మఱియు స్వధర్మముయొక్క స్రోవయందును అదియే తారసిల్లునేని, దాని వలనఁగూడ లిప్తముకాని మనసుకలవాఁడును, కామనా రహితుఁడును, ప్రాప్తజ్ఞానుఁడును అగునట్టి జీవుని పాపము

స్పృశింపఁబోదు. కాని ఈ జ్ఞానమును ఆదర్శమును మిక్కిలి స్వల్పసంఖ్యాకులకు మాత్రమే లభ్యము. ఇది సాధారణ ధర్మము కానేరదు. అట్లైనచో ఈపథముపై నడచెడు సాధారణపథికులకు కర్తవ్యకర్మ మేది? ఆతఁడు యంత్రి, నేను యంత్రమును— అను ఈ జ్ఞానము వారలకును ఏదో కొలఁదిగాఁ బ్రాపింప నగుచున్నది. ఈజ్ఞానబలముచే భగవంతుని స్మరించుచు స్వధర్మమును సేవించుటయే వారల కాదేశింపఁబడినది.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్.

స్వధర్మ మనఁగా స్వభావ నియతమైన కర్మ. కాలగతిచే స్వభావమున కభివ్యక్తియు పరిణతియు కలుగుచున్నవి. ఏది మానవుని సాధారణ స్వభావముగా కాలగతిచే నిర్మింపఁబడుచున్నదో, ఆ స్వభావముచే నియతమైన కర్మమే యుగధర్మము. జాతియొక్క కర్మగతిచే జాతీయస్వభావముగా నేది నిర్మింపఁబడుచున్నదో, ఆ స్వభావముచే నియతమైన కర్మయే జాతిధర్మము. వ్యక్తియొక్క కర్మగతిచే ఏ

స్వభావము నిర్మింపఁబడుచున్నదో, ఆస్వభావముచే నియతమైన కర్మయే వ్యక్తిధర్మము. ఈ వివిధధర్మములకును సనాతనధర్మముయొక్క ఆదర్శము సాధారణమైన దగుటచే దానిచేత నియ్యవి పరస్పరము మేళవింపఁబడినవై శాసింపఁ బడుచున్నవి. ఇట్లేర్పడిన ధర్మమే ధర్మాసక్తికల సాధారణునకు స్వధర్మమగుచున్నది. బ్రహ్మచారిదశయందు ఈ ధర్మసేవకొఱకే జ్ఞానమును శక్తియును సంచితమొనర్పఁబడును; గృహస్థాశ్రమమందు ఈధర్మ మనుష్ఠింపఁబడును; ఈ ధర్మమును సంపూర్ణముగా ననుష్ఠించుటచే వానప్రస్థమునకుఁగాని, సన్న్యాసమునకుఁగాని అధికారము కలుగుచున్నది. ఇదియే ధర్మముయొక్క సనాతనగతి.

---

# మా య

మన పురాతన దార్శనికులు జగముయొక్క మూల తత్త్వముల అన్వేషణకై వెడలి, ఈ సృష్టియొక్క మూలమున అనశ్వరమును వ్యాపకమును అగు ఒకవస్తువుయొక్క అస్తిత్వము ననుభవించిరి. పాశ్చాత్య దేశములందలి ఆధునికశాస్త్రవిజ్ఞులు బహుకాల మన్వేషించి, బాహ్యజగమందును ఈ అనశ్వరమును సర్వవ్యాపియు నగు ఏకత్వముయొక్క అస్తిత్వము విషయమున రూఢిని జేరిరి. వారు ఆకాశమే భౌతికతత్త్వముయొక్క మూలమని స్థిరము చేసియున్నారు. మఱియు ఆకాశము భౌతిక ప్రపంచకమునకు మూలమనియు, దానినుండి మిగిలిన సకలభౌతికదశలును ప్రకృతిపరిణామద్వారమున పుట్టెననియు భారతదేశముయొక్క పురాతనదార్శనికులు బహుసహస్రసంవత్సరములపూర్వము సిద్ధాంతీకరించిరి. కాని వా రీ సిద్ధాంత

మును చరమసిద్ధాంతముగాఁదలఁచి తృప్తిపడలేదు. స్థూలమైన ఈ భౌతికప్రపంచమునకు వెనుక నొక సూక్ష్మప్రపంచము కలదనియు, మఱియు సూక్ష్మాకాశమే ఈప్రపంచమునకు మూలమైన భౌతికతత్త్వమనియు వారు యోగబలముచే సూక్ష్మజగమునఁ బ్రవేశించి తెలిసికోఁగల్గిరి. ఈ ఆకాశమే కడపటివస్తువు కాదు. వారు కడపటి వస్తువును ప్రధానమని పేర్కొనిరి. ప్రకృతి—అనఁగా జగమందంతటను వ్యాపించిన క్రియాశక్తి— తన సార్వత్రికమైన స్పందనముచే ఈ ప్రధానమును సృష్టించి, దానినుండి కోటానకోట్ల అణువుల నుత్పన్నముచేయును. ఈ అణువుల ద్వారమున సూక్ష్మభూతములు నిర్మింపఁబడుచున్నవి. ప్రకృతి లేక క్రియాశక్తి తనకొఱకై ఏమియును చేయదు. అది యెవ్వనిశక్తియో ఆతనికి తుష్టి కల్గించుటకే ప్రపంచముయొక్క ఈసృష్టియు, బహువిధమైన ఈగతియు. ఆత్మ, లేక పురుషుఁడు, ఈ ప్రకృతియొక్క క్రీడకు అధ్యక్షుఁడు, మఱియు సాక్షి. ఏ అనిర్వచనీయ పరబ్రహ్మము యొక్క స్వరూపమును క్రియయును పురుషప్రకృతులో, ఆపరబ్రహ్మమే జగముయొక్క అనశ్వరమును అద్వితీయ

మును అగు మూలసత్యము. ముఖ్యములైన ఉపనిషత్తు లందు ఆర్యఋషుల తత్త్వానుసంధానముచే ఏ సత్యము లావిష్కరింపఁబడియున్నవో ఆయన్నింటికిని కేంద్రస్వరూపముగా ఈ బ్రహ్మవాదమును పురుషప్రకృతివాదమును ప్రతిష్ఠింపఁబడియున్నవి. తత్త్వద్రష్ట లీ మూలసత్యములఁ గైకొని వివిధతర్కములతో, అనేక వాద వివాదములతో పలుతెఱఁగుల చింతాప్రణాళిని సృష్టించినారు. ఎవరు బ్రహ్మవాదులో వారు వేదాంతదర్శనమునకు ప్రవర్తకులు. ఎవరికి ప్రకృతివాదమునందు పక్షపాతమో వారు సాంఖ్యవాదమునకు ప్రచారకులైరి. మఱియు ననేకులు భౌతిక ప్రపంచమునకు పరమాణువులే మూలతత్త్వముగా గ్రహించి వేఱుమార్గమున నడచినారు. ఈ విధముగా వివిధమార్గము లేర్పడినపిమ్మట, శ్రీకృష్ణుఁడు గీతయందీ సకల విచారణాప్రణాలికలకును సమన్వయమును సామంజస్యమును స్థాపన మొనర్చి, వ్యాసదేవుని ముఖతః ఉపనిషత్సత్యములను తిరిగి ప్రచార మొనర్చెను. పురాణ కర్తలును వ్యాసదేవ రచితమైన పురాణము నాధారముగాఁ గైకొని, ఆ సత్యములకు పలువిధమైన వ్యాఖ్య

లను ఉపాఖ్యానములందును కథానకములందును సామాన్యజనుల కందింపఁజేసిరి. దీనివలన విద్వన్మండలియందు వాదవివాదములు ముగిసి పోలేదు; వారు తమ తమ మతములను ప్రచార మొనర్చుచు దర్శనశాస్త్రముయొక్క భిన్న శాఖల సిద్ధాంతములను సుస్పష్ట మగునట్లు తర్కములచే సమర్థింపఁ దొడఁగిరి. మన షడ్దర్శనముల ఆధునికరూపము ఈ తరువాతి విచారణలయొక్క ఫలము. కడకు శంకరాచార్యులు దేశమం దంతటను వేదాంతప్రచారమునకై అపూర్వమును చిరస్థాయియు నగు నేర్పాటు గావించి, సామాన్యజనుల హృదయమందు వేదాంతముయొక్క ఆధిపత్యమును దృఢముగా నెలకొల్పెను. అటుపై నితరములైన వివిధదర్శనములు అల్పసంఖ్యాకులైన విద్వాంసులందు మాత్రమే నెలకొనియుండెను; కాని వాని ఆధిపత్యమును ప్రభావమును ఆలోచనప్రపంచమునందు రమారమి అంతరించిపోయెను. సర్వజనసమ్మతమైన వేదాంతదర్శనమందు మతభేదములు తలచూపుటచే, అది మూడు ముఖ్యశాఖలుగాను అనేక గౌణశాఖలుగాను చీలిపోయెను. జ్ఞానప్రధానమైన అద్వైతవాదమునకును భక్తిప్రధానములైన విశిష్టా

ద్వైతవాదమునకును ద్వైతవాదమునకును విరోధము ఇప్పటికిని నిలిచియే యున్నది. జ్ఞానమార్గులు భక్తుల ఉద్దామమైన ప్రేమను భావప్రవణతను ఉన్మాదలక్షణములని త్రోసిపుత్తురు. భక్తులు జ్ఞానమార్గుల తత్త్వజ్ఞానకాంక్షను శుష్కతర్కమని నిరసన చేయుదురు. ఈ ఇరువుర మతములును భ్రాంతములు, మఱియు సంకీర్ణములు. భక్తిశూన్యమైన తత్త్వజ్ఞానముచే అహంకారము వృద్ధిపొంది ముక్తిమార్గ మవరుద్ధ మగును. జ్ఞానశూన్యమైన భక్తి అంధవిశ్వాసమునకును భ్రమసంకులమైన తామసికతకును ఆటపట్టు. ఉపనిషత్తులచేఁ జూపఁబడిన అసలు తెరువునందు జ్ఞానభక్తి కర్మల సామంజస్యమును పరస్పర సహాయకతయు కాపాడఁబడియున్నవి.

ఆర్యధర్మము సార్వత్రికముగా సార్వజనీనముగా ప్రచారము చేయవలయునేని దానిని యథార్థమైన ఆర్యజ్ఞానముపై స్థాపింపవలయును. దర్శనములును శాస్త్రములును చాలకాలమునుండియు ఏకపక్షమును ప్రకాశింపఁజేయునవై అసంపూర్ణము లైనవి. సంకీర్ణమైన ఒకానొక

మతమునకు సంబంధించిన తర్కమునందు సమస్తజగమును బంధింపవలయునన్న, సత్యముయొక్క ఒకానొకవైపు సువిశదముగా వివరింపఁబడినది కావచ్చును, కాని మిగిలిన వైపును గమనింపకపోవుటయు తటస్థింపవచ్చును. అద్వైతవాదుల మాయావాదము ఈ విధమైన దోషమునకు దృష్టాంతము. బ్రహ్మము సత్యము, జగము మిథ్య, ఇదియే మాయావాదమునకు మూలమంత్రము. ఈ మంత్రమే జాతియొక్క విచారణాప్రణాళికి మూలమంత్రముగా నెలకొల్పఁబడునో, ఆ జాతియందు జ్ఞానలిప్సయు, వైరాగ్యమును, సన్యాసరుచియు నభివృద్ధిపొందును; రజఃశక్తి తిరోహితమై తమః సత్త్వములకు ప్రాబల్య మేర్పడును. ఒకవైపున, ప్రాప్తజ్ఞానులైన సన్యాసులు, సంసారవిముఖులును ప్రేమపూరితులును ఐన భక్తులు, శమపరాయణులైన విరాగులు, ఈ ఎల్లరి సంఖ్యయు వృద్ధియగును. వేఱొకవైపున, తామసికమును, జ్ఞానరహితమును, అప్రవృత్తిచే విమోహితమును అకర్మణ్యమును అగు సాధారణప్రజకు దుర్దశయే వాటిల్లును. జగము మిథ్యయే యగునేని జ్ఞానతృష్ణ వినా మిగిలిన సర్వప్రయ

త్నమును నిరర్థకమనియు అనర్థకమనియు చెప్పవలసి వచ్చును. కాని మానవజీవితమందు జ్ఞానతృష్ణయేగాక ఉపకారకములైన పెక్కు ప్రబలవృత్తులయొక్క ఖేల కలదు. వాని నన్నింటిని ఉపేక్షించినచో ఏజాతియు నిలువ నేరదు. ఈ అనర్థమునకు భయపడియే శంకరాచార్యులు పారమార్థికమనియు వ్యావహారికమనియు జ్ఞానముయొక్క ద్వైవిధ్యముచూపి, అధికారభేదము ననుసరించి జ్ఞానకర్మల విషయమై వ్యవస్థను నిల్పెను. కాని ఆకాలమునాటి క్రియాసంకులమైన కర్మమార్గము నతఁడు తీవ్రముగా ఖండించుటచే విపరీతఫలము ఫలించినది. శంకరుని ప్రభావముచే ఆ కర్మమార్గ మించుమించు లుప్తమై పోయినది, వైదికమగు క్రియాతంత్రము అంతరించిపోయి నది; కాని సాధారణజనుల మనమునందు జగము మాయా సృష్టమనియు, కర్మ అజ్ఞానప్రసూతమనియు, ముక్తికి విరోధియనియు, అదృష్టమే సుఖదుఃఖములకు కారణ మనియు, ఇత్యాది తమఃప్రవర్తకములైన మతములు దృఢముగా పాదుకొనిపోయినవి. ఇట్లగుటచే రజఃశక్తిని మరల ప్రకాశింపఁజేయుట అసాధ్యమై కన్పట్టుచున్నది.

ఆర్యజాతిని రక్షించుటకై భగవంతుఁడు పురాణముల యొక్కయు తంత్రముఁయొక్కయు ప్రచారముచే మాయావాదమును ప్రతిరోధించినాఁడు. పురాణము లందు ఉపనిషత్ప్రసూతములైన ఆర్యధర్మముయొక్క వివిధాంశములు కొంతకొంత రక్షింపఁబడినవి. తంత్రములు శక్త్యుపాసనాద్వారమున ముక్తి భుక్తిస్వరూపమైన ద్వివిధఫలమును బడయుకొఱకై జనులను కర్మయందు ప్రవేశపెట్టెను. జాతిని రక్షించుకొఱకై యెవ్వరు యుద్ధ మొనర్చిరో యట్టి ప్రతాపసింహుఁడు, శివాజీ, ప్రతాపాదిత్యుఁడు, చాంద్రాయి మొదలగువారు, ఇంచుమించు అందఱును, శక్త్యుపాసకులో లేక తాంత్రికయోగుల శిష్యులో అయియుండిరి. తమోగుణముచేఁ గలుగు అనర్థమును తొలఁగించుకొఱకై గీతయందు శ్రీకృష్ణుఁడు కర్మసన్న్యాసమునకు విరోధకమైన ఉపదేశము నొసఁగెను.

మాయావాదము సత్యముపై ప్రతిష్ఠింపఁబడినది. ఈశ్వరుఁడు పరమమాయావి యనియు, ఆతని మాయ ద్వారముననే ఈ కనఁబడు జగము సృష్టింపఁబడిన దనియు

ఉపనిషత్తులందును చెప్పఁబడియున్నది. త్రైగుణ్యమయి యగు మాయయే జగమంతయును వ్యాపించియున్నదని గీతయందు శ్రీకృష్ణుఁడు తెలిపినాఁడు. ఏకమును అనిర్వచనీయమును అగు బ్రహ్మము జగముయొక్క మూలసత్యము. ఈ సమస్తప్రపంచమును ఆతని అభివ్యక్తి మాత్రమే. ఇది పరిణామశీలము, మఱియు నశ్వరము. 'బ్రహ్మమొక్కటియే సనాతనసత్యమగునేని భేద బహుత్వము లెచ్చటినుండి ఉద్భవించినవి, దేనియందు ప్రతిష్ఠింపఁబడియున్నవి, ఏవిధానముచే వ్యక్తమగుచున్నవి' అను నీప్రశ్న అనివార్యము. బ్రహ్మమే ఏకమాత్రసత్యమగునేని బ్రహ్మమునుండియే భేద బహుత్వములు రావలయును, బ్రహ్మమందే ప్రతిష్ఠితములై యుండవలయును, బ్రహ్మముయొక్క ఏదో అనిర్వచనీయమైన శక్తిద్వారము ననే వ్యక్తములు కావలయును—ఇదియే ఉపనిషత్తుల ప్రత్యుత్తరము. ఆ శక్తియే కొన్నిచోట్ల మాయావియొక్క మాయ యనియు, కొన్నిచోట్ల పురుషాధిష్ఠితమైన ప్రకృతియనియు, కొన్నిచోట్ల ఈశ్వరునియొక్క విద్యాఽవిద్యామయియైన ఇచ్ఛాశక్తియనియు చెప్పఁ

బడినది. ఇది తార్కికుల మదికి సంతృప్తికొలుపలేక పోయెను. 'ఏవిధమున ఏకమునుండి బహుత్వము కలుగును, అభేదమునుండి భేద ముత్పన్నమగును' అనుసందర్భమునకు సంతృప్తిజనకమైన వివరణ చేయఁబడలేదు. కడపటకు ఒకానొక సులభమైన ప్రత్యుత్తరము మనసునకు గోచరించెను: ఏక మనేక మగుటలేదు, సనాతనమైన అభేదమునందు భేద ముత్పన్నము కానేరదు; బహుత్వము మిథ్య; భేద మళీకము, సనాతనమును అద్వితీయమును అగు నాత్మయందు స్వప్నమువలె భాసించు మాయ మాత్రము; ఆత్మయే సత్యము, ఆత్మయే సనాతనము. కాని ఇందును గందరగోళము. మరల మాయ అనఁగా నేమి? మాయ ఎచటనుండి ప్రసూతమైనది? దేనియందు ప్రతిష్ఠితమైనది, ఏవిధమున వ్యక్తమైనది? శంకరుని ప్రత్యుత్తర మిది: మాయ అననేమో చెప్పుటకు వీలులేదు, మాయ అనిర్వచనీయము; మాయ ప్రసూతమగుటలేదు, మాయ చిరకాలమునుండియు కలదు; ఇట్లయ్యును అది లేనిది. కాని గందరగోళ ముపశమింపదయ్యెను, తృప్తికరమైన ప్రత్యుత్తరము లభింపదయ్యెను. ఈతర్క

ముచే ఏకమును అద్వితీయమును అగు బ్రహ్మమునందు మఱింకొక ఏకమును సనాతనమును అనిర్వచనీయము నగు వస్తువు నెలకొల్పఁబడినది. ఏకత్వము రక్షింపఁబడ లేదు.

శంకరుల యుక్తికన్న ఉపనిషత్తుల యుక్తి ఉత్కృష్టమైనది. భగవంతుని ప్రకృతి జగతికి మూలము. ఆ ప్రకృత్తియే శక్తి— సచ్చిదానందుని సచ్చిదానంద మయమగు శక్తి. ఆత్మవిషయమున భగవంతుఁడు, పర మాత్మ, జగమువిషయమున పరమేశ్వరుఁడు. పరమేశ్వ రుని ఇచ్ఛ శక్తిమయము, ఆ ఇచ్ఛవలననే ఏకమునుండి అనేకము, అభేదమునుండి భేదము నుత్పన్న మగుచున్నది. పరమార్థదృష్టియందు బ్రహ్మము సత్యము, జగము మిథ్య, 'పరామాయ'చే ప్రసూతమైనట్టిది; ఏలన బ్రహ్మము నుండియే ఉత్పన్నమగుచున్నది, బ్రహ్మమునందే విలీనమగు చున్నది. దేశకాలములందే ప్రపంచముయొక్క కలిమి; బ్రహ్మముయొక్క దేశకాలాతీతమైన దశయందు దాని కస్తిత్వము లేదు. బ్రహ్మమునందు ప్రపంచయుక్తములైన దేశకాలములు; బ్రహ్మము దేశకాలములయందు ఆబద్ధ

మగుటలేదు. జగము బ్రహ్మమునుండియే ప్రసూతమగు చున్నది, బ్రహ్మమునందే వర్తిలుచున్నది. సనాతనమును అనిర్దేశ్యమును అగు బ్రహ్మమునందు ఆద్యంతవిశిష్టమైన జగతియొక్క ప్రతిష్ఠ; అందే బ్రహ్మముయొక్క విద్యావిద్యామయమైన శక్తివలన సృజింపఁబడి విరాజిలుచున్నది. ఏవిధముగా మానవునకు యథార్థముగా సత్యమైనదానిని ఉపలబ్ధి చేసికొను శక్తియేకాక, కల్పనాద్వారమున అలీక వస్తువునుగూడ ఉపలబ్ధిచేసికొను శక్తికలదో, అట్లే బ్రహ్మమందును విద్యయును అవిద్యయును, సత్యమును అనృతమును కలవు. కాని అనృతము దేశకాలముల సృష్టి. మానవునికల్పన దేశకాలముల గతియందు సత్య ముగా పరిణమించుటచే ఏవిధమున అనృతముకాదో, ఆవిధముననే మనము దేనిని అనృత మనుచున్నామో అది సంపూర్ణముగా అనృతముకాదు, సత్యముయొక్క అనుభూతమైన దశమాత్రము. యథార్థమునకు సర్వమును సత్యము. దేశకాలాతీతమైన దశయందు జగము మిథ్య, కాని మనము దేశకాలాతీతులము కాము, మనము జగ మును మిథ్యయనుట కధికారులము కాము. దేశకాల

ములయందు జగము మిథ్యకాదు; జగము సత్యము. ఎప్పుడు దేశకాలముల కతీతులమై బ్రహ్మమునందు విలీనమగుటకు సమయ మాసన్నమగునో, మఱియు శక్తి ఉత్పన్నమగునో, అపుడు మనము జగమును మిథ్యయనఁ గల్గుదుము. అనధికారులమై పల్కినచో మిథ్యాచారమగును, ధర్మమునకు విపరీతగతి వాటిల్లును. మనవిషయమున బ్రహ్మము సత్యము, జగము మిథ్య యనుటకంటె బ్రహ్మము సత్యము, జగము బ్రహ్మము అనుట ఉచితము. ఇదియే ఉపనిషత్తులఉపదేశము, 'సర్వం ఖల్విదం బ్రహ్మ'; ఈసత్యముపై ఆర్యధర్మము నెలకొల్పఁబడినది.

---

# అహంకారము

మనభాషయందు అహంకారశబ్దమున కర్థము చాల మార్పు చెందినది. ఆ హేతువుచే ఆర్యధర్మముయొక్క ప్రధానమతములను గ్రహించుపట్టున పెక్కుసమయము లందు మిక్కిలి చిక్కు కలుగుచున్నది. గర్వము రాజసికాహంకారముయొక్క ఒకానొక విశేష పరిణామము మాత్రము; అయినను సాధారణముగా అహంకారశబ్దమున కీ అర్థమే గ్రహింపఁబడుచున్నది. అందుచేతనే అహంకారత్యాగము విషయమై చెప్పినప్పుడు గర్వపరిత్యాగముయొక్క మాటయో, రాజసికాహంకారమును వర్జించుటగూర్చియో మనస్సు గ్రహించుచున్నది. యథార్థమునకు అహంజ్ఞానమే అహంకారము. అహంబుద్ధి విజ్ఞానమయాత్మయందు సృజింపఁబడినది; ప్రకృతియందంతర్గతములైన త్రిగుణముల క్రీడచే దానియందు

మూఁడు తెఱఁగుల వృత్తులు వికసించుచున్నవి. అయ్యవి సాత్వికాహంకారము, రాజసికాహంకారము, తామసికాహంకారము. సాత్వికాహంకారము, జ్ఞానప్రధానము, సుఖప్రధానము. నాకు జ్ఞానము కల్గుచున్నది, నాకు ఆనంద మగుచున్నది, అను నీభావములు సాత్వికాహంకారముయొక్క క్రియలు. సాధకునియొక్కయు, భక్తునియొక్కయు, జ్ఞానియొక్కయు, నిష్కామకర్మియొక్కయు అహము సత్వప్రధానము, జ్ఞానప్రధానము, సుఖప్రధానము. రాజసికాహంకారము కర్మప్రధానము. నేను కర్మ నాచరించుచున్నాను, నేను గెల్చుచున్నాను, ఓడుచున్నాను, ప్రయత్నము చేయుచున్నాను, నాదియే కార్యసిద్ధి, నాదియే అసిద్ధి, నేను బలవంతుఁడను, నేను సుఖని, నేను దుఃఖని అను నీ సకలభావములును రజఃప్రధానములు, కర్మప్రధానములు, ప్రవృత్తిజనకములు. తామసికాహంకారము అజ్ఞతతోడను అనుద్యమముతోడను పరిపూర్ణము. నే నధముఁడను, నేను నిరుపాయుఁడను, నే నలసుఁడను, అసమర్థుఁడను, హీనుఁడను, నాకే ఆశయును కనఁబడుటలేదు, ప్రకృతియందు లయమై పోవు

చున్నాను, లయ మగుటయే నాగతి, అను నీ సకల భావములును తమఃప్రధానములు; అప్రవృత్తికిని అప్రకాశమునకును కారకములు. ఎవరు తామసికాహంకారముచే క్లేశ మనుభవింతురో వారికి గర్వములేదు; అయినను అహంకారము పూర్ణపరిమాణమై కలదు. కాని ఆ అహంకారము అధోగతికిని వినాశమునకును శూన్యబ్రహ్మప్రాప్తికిని హేతువు. ఏవిధముగా గర్వమున అహంకారము కలదో అట్లే నమ్రతయందును అహంకారము కలదు. ఏవిధముగా బలమునం దహంకారము కలదో అట్లే దుర్బలతయందును అహంకారము కలదు. ఎవరు తామసికభావముచే గర్వహీనులో వా రధములు, దుర్బలులు; భయముచేతను, నిరాశచేతను పరుల పాదములమ్రోల పడియుందురు. తామసికమైన నమ్రతకును, తామసికమైన క్షమకును, తామసికమైన సహిష్ణుతకును ఏ విలువయు లేదు; వానినుండి ఏ సుఫలమును ఫలింపదు. ఎవ్వఁడెల్లయెడలను నారాయణుని దర్శించి ఎల్లరియెడలను నమ్రుఁడో, సహిష్ణుఁడో, క్షమావంతుఁడో, ఆతఁడే పుణ్యుఁడు. ఎవ్వఁ డహంకృతియొక్క ఈ సకలవృత్తులను

పరిత్యజించి త్రైగుణ్యమయియగు మాయ నతిక్రమించునో, ఆతనికి గర్వమునులేదు, నమ్రతయులేదు. భగవంతుని జగద్వ్యాపియైన శక్తి ఆతని మనః ప్రాణ రూపమైన ఆధారమందు ఏ భావము నుంచునో ఆతఁడు దానితోఁడనే సంతుష్టుఁడగును. అనాసక్తమును అవిచాల్యమును ఐన శాంత్యానందములతో అతఁడు మెలఁగును. తామసికాహంకారము ఎల్లవిధములను వర్జింపఁదగినది; రాజసికాహంకారమును మేలుకొల్పి, సత్వప్రసూతమైన జ్ఞానముయొక్క సాహాయ్యముచే దానిని నిర్మూలమొనర్చుట ఉన్నతికి మొదటిమెట్టు. రాజసికాహంకారము నుండి తప్పించుకొను నుపాయము జ్ఞానము, శ్రద్ధ, మఱియు భక్తియొక్క వికాసము. సత్వప్రధానుఁడు నేను సుఖిని అని పలుకఁడు. నాప్రాణము నందు సుఖవికాసము కలుగుచున్న దని ఆతఁ డనును. నేను జ్ఞాని నని ఆతఁడు పలుకఁడు. నాయందు జ్ఞానసంచారము జరుగుచున్న దని ఆతఁ డనును. ఏలన ఆ సుఖ జ్ఞానములు తనవి కావనియు జగన్మాత వనియు ఆతఁ డెఱుఁగును; అయినను ఆనంద సంభోగముకొఱకై ఏ ప్రకారములైన అనుభవముల యం

దేనిలిప్తత అతని కెంతవఱకు నిలుచునో అంతవఱ కాజ్ఞాని యొక్క గాని భక్తునియొక్క గాని భావము అహంకృత మనవలయును. "నాకు కలుగుచున్నది" అని పల్కినప్పుడు అహంబుద్ధి పరిత్యజింపఁబడుటలేదు. గుణాతీతుఁడే సంపూర్ణముగా అహంకారమును జయించినవాఁడు. అతని జ్ఞానమునకు జీవుఁడు సాక్షి, భోక్త; పురుషోత్తముఁడనుమంత, ప్రకృతి కర్త. ఇందు 'నేను' నకు తావు లేదు. సర్వమును 'ఏకమేవాద్వితీయం' అగు బ్రహ్మములోని విద్యా-అవిద్యామయి యగు శక్తియొక్క లీల. అహంజ్ఞానము జీవాధిష్ఠితమైన ప్రకృతియందు మాయవలన పుట్టిన ఒకానొక భావము మాత్రము. ఈ అహంజ్ఞానరహితమైన ఉనికియొక్క చరమదశ, సచ్చిదానందమందు లీనమగుట. కాని ఎవ్వఁడు గుణాతీతుఁడయ్యును పురుషోత్తముని యిచ్ఛచే లీలయందే నెలవు గొని యుండునో, అతఁడు పురుషోత్తమునియొక్కయు జీవునియొక్కయు భిన్నమైన అస్తిత్వమును కాపాడుచు, తనను ప్రకృతివిశిష్టమగు భగవదంశగా తెలిసికొని లీల యొక్క కార్యమును నిష్పన్న మొనర్చును. ఈ భావము

నహంకార మనరాదు. పరమేశ్వరునియందును ఈ భావము కలదు. అజ్ఞానము కాని, లిప్తత కాని ఆతని యందు లేదు; కాని ఆతని ఆనందమయత్వము ఆతనియందే నిలిచి యుండునట్టిది కాక జగన్ముఖ మగును. ఎవని భావ మిట్టిదో ఆతఁడే జీవన్ముక్తుఁడు. లయరూపమగు ముక్తి దేహము పడి పోయిన పిమ్మట పడయఁదగును. జీవన్ముక్తదశ దేహమందే అనుభూత మగును.

---

# నివృత్తి

మనదేశమందే నాడును, సంకుచితమైనట్టి గాని జీవితముయొక్క విపులకర్మప్రవృత్తికి విరోధమైనట్టి గాని వ్యాఖ్యానము ధర్మశబ్దమునకు విద్వాంసులచే నంగీకరింపఁ బడియుండలేదు. జీవితమంతయు ధర్మముయొక్క క్షేత్రము- అను ఈ గభీరమగు మహాతత్త్వము హిందువులయొక్క జ్ఞానశిక్షణముల పునాదియందు స్థాపితమైయున్నది. పాశ్చాత్యశిక్షణముయొక్క స్పర్శచే కలుషితమై, మన జ్ఞాన శిక్షణములకు వికృతమును అస్వాభావికమును అగు దశ ప్రాప్తించినది. సన్యాసము, భక్తి, సాత్త్వికభావము ఇయ్యవి వినా మఱి వేతేవియును ధర్మము*యొక్క అంగములు

* ఇంగ్లీషులోని 'రిలిజియన్' (Religion) అనుమాట వంగ మున 'ధర్మ' అని అనువదింపఁ బడుచున్నది; క్రైస్తవమతము, మహమ్మదీయమతము అను వ్యవహారమునందు తెలుగులో ఆమాటయే 'మతము'

కాఁజాలవను అసమంజసమైన అభిప్రాయమునందు మనము తలఁచు భ్రాంతివశమున పడుచున్నాము. పాశ్చాత్యులీ సంకుచితమైన అభిప్రాయముతోడనే 'ధర్మము'ను గూర్చిన విచారణను గావింతురు. హిందువులు జీవితముయొక్క సమస్తకార్యములను ధర్మము అధర్మము అను రెండువిధములక్రింద విభజించిరి. పాశ్చాత్యులు ధర్మమనియు, అధర్మమనియు, ధర్మాధర్మములకు బాహ్యము, అనఁగా ధర్మాధర్మవిచారణలతో ప్రసక్తిలేనిది అనియు మూఁడు విభాగములను జేయుచున్నారు. ఈ కడపటి విభాగమందే జీవితముయొక్క కార్యములలోను ప్రవృత్తులలోను అధికభాగము చేర్పఁబడుచున్నది. భగవంతుని

---

అని అనువదింపఁబడుచున్నది. సంకుచితార్థముకల 'రిలిజియన్'శబ్దమును వంగభాషలో ధర్మశబ్దవ్యవహారముచే, మిక్కిలి వ్యాప్తిమంతమైన అర్థముకల ధర్మశబ్దముయొక్క శక్తికి కొంతహానియు, వికృతియు ఘటస్థించినవి. ధర్మమునుగూర్చిన చర్చలలో మనస్సునందు 'రిలిజియన్' అనుమాట నుంచుకొని, భావములను తాఱుమాఱు చేయుట వంగ వ్యవహారమున సాధారణమైనది. ఈ సందర్భమే గ్రంథమం దిచట విమర్శ చేయఁబడుచున్నది.—(అనువాదకుఁడు.)

ప్రశంసించుట, ప్రార్థించుట, చర్చియందు ఫాదరియొక్క బోధను వినుట ఇత్యాది కర్మలను 'ధర్మము' (మతము) లేక Religion అందురు. Morality లేక మంచి చేయుట ధర్మాంగముకాదు; అది భిన్నము. కొందలు Religion మఱియు Morality అనురెండింటిని ధర్మము యొక్క గౌణాంగములుగా స్వీకరించుటయు కలదు. చర్చికి పోవకుండుట, నాస్తికవాదము లేక సంశయవాదము, మతమును (Religion) నిందించుట లేక ఆ విషయమున ఔదాసీన్యము వహించుట, వీనినే అధర్మమని (Irreligion) యందురు; చెడుగుచేయుటను Immorality లేక అవినీతి యందురు. పైనుల్లేఖించిన కొందఱ మతము ననుసరించి ఇదియును అధర్మముయొక్క అంగమగును. అది యెట్లైనను, ఆచరణలును ప్రవృత్తులును అధికాంశముగా ధర్మాధర్మములకు బహిర్భూతములు. Religion and Life (మతము మఱియు జీవితము), ధర్మము మఱియు లౌకికకర్మ ఇవి విభిన్నములు. మనలో ననేకులు ధర్మశబ్దమున కిట్టి వికృతార్థము చేయుచున్నారు. సాధువులయొక్కయు సన్యాసులయొక్కయు విషయము, భగవద్విషయము, దేవీ దేవతల

విషయము, సంసారపరిత్యాగవిషయము, ఇదంతయు వారు ధర్మ మనుపేరిట వాకొందురు; కాని వేతే ప్రసంగమైనను తటస్థించినచో 'ఇది సంసారవిషయము, ధర్మవిషయము కాదు' అని పల్కుదురు. వారిమదియందు పాశ్చాత్యుల Religion (మతము) యొక్క భావము పాదుకొనినది. ధర్మశబ్దము వినినంతనే Religion అను మాట వారి మదియం దుదయించును. తమకు తెలియకయే కూడ ఆ అర్థముననే ధర్మశబ్దమునుగూడ వ్యవహరింతురు. కాని మన స్వదేశి మాటయందు ఈ విధమైన విదేశిభావమును చొప్పింతుమేని, ఉదారమును సనాతనమును అగు ఆర్యుల భావమునుండియు శిక్షణమునుండియు మనము భ్రష్టుల మగుదుము. సమస్త జీవనమును ధర్మమునకు క్షేత్రమే. సంసారమును ధర్మమే; ఆధ్యాత్మికజ్ఞానముయొక్క ఆలోచనయు, భక్తిభావమును, ఇవిమాత్రమే ధర్మము కాదు; కర్మయును ధర్మమే. మన వాఙ్మయమం దంతటను ఈ మహాశిక్షణమే సనాతనముగా నిల్చియున్నది; ఇదియే సనాతనధర్మము— 'ఏష ధర్మః సనాతనః'—

"కర్మ ధర్మముయొక్క అంగ మనుమాట నిజమేకాని అన్ని తెఱఁగుల కర్మలును కావు. ఏవి సాత్త్వికభావము కల ట్టివో, ఏవి నివృత్తి కనుకూలించునో, అవి మాత్రమే ధర్మ శబ్దముచే వ్యవహరింపఁబడుట కర్హములు"—అని అనేకుల అభిప్రాయము. ఇదియును పొరపాటు. ఏ విధముగా సాత్త్వికకర్మము ధర్మ మగునో, అట్లే రాజసికకర్మమును ధర్మమే. జీవులపై దయఁజూపుట ఎట్లు ధర్మమో, అట్లే ధర్మయుద్ధమందు దేశశత్రువులను వధించుటయు ధర్మము. పరోపకారముకొఱకై తన సుఖమును, ధనమును, కడకు ప్రాణమును ఆహుతిచేయుట ఎట్లు ధర్మమో, అట్లే ధర్మ సాధనమైన శరీరమును తగు విధమున రక్షించుటయు ధర్మము. రాజనీతియు ధర్మము. కావ్యరచనయు ధర్మము. చిత్రలేఖనమును ధర్మము. మధురగానముచే పరులను రంజింపఁజేయుటయు ధర్మము. ఏకర్మయందు స్వార్థము లేదో ఆకర్మ క్షుద్రమైనను అగుఁగాక, గొప్పదైనను అగుఁగాక, అదియే ధర్మము. గొప్ప చిన్నలను మనము పరిగణింతుము. భగవంతునికడ గొప్పచిన్నలు లేవు. ఏ భావముతో మనుష్యుఁడు తన స్వభావోచితమైన లేక విధిప్రదత్తమైన

కర్మ నాచరించుచున్నాఁడు—అను విషయముపై మాత్రమే భగవంతుఁడు తన దృష్టి నుంచును. ఏకర్మనైనను ఆచరింతుముగాక, దాని నాతని చరణములకడ నర్పించుట, యజ్ఞభావముతో నాచరించుట, ఆతని ప్రకృతి చేతనే అది నిర్వర్తింపఁబడుచున్నదని యెఱిఁగి సమభావమందు నిలువఁబడుట—ఇదియే శ్రేష్ఠధర్మము.

ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథాః మా గృధః కస్యస్విద్ధనం,
కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః.

అనఁగా, మనము చూచునట్టి చేయునట్టి భావించునట్టి సకలమును ఆతనియందే చూచుట, ఆతని మననముతో సర్వమును వస్త్రముతోవలె ఆవృత మొనర్చివైచుట, ఇదియే శ్రేష్ఠమార్గము. ఈ ఆవరణమున పాపముగాని అధర్మముగాని ప్రవేశింపఁజాలవు. అన్నికర్మలయెడలను వాసనను ఆసక్తిని మనసునందుండి వెడలించి, ఏమియును కోరక, కర్మప్రవాహమం దేది ప్రాప్తమగునో దానినే భుజింతుముగాక; సర్వకర్మలను ఆచరింతుముగాక; దేహ

మును కాపాడుకొందుము గాక. ఇదియే భగవంతునకుఁ బ్రియమైన ఆచరణము; ఇదియే శ్రేష్ఠధర్మము. ఇదియే నిజమైన నివృత్తి. బుద్ధియే నివృత్తికి స్థానము. ప్రాణమును ఇంద్రియములును ప్రవృత్తి కాటపట్టులు. బుద్ధి ప్రవృత్తిచే స్పృశింపఁబడుటయే చిక్కులకు హేతువు. బుద్ధి నిర్లిప్తభావమున సాక్షియై మఱియు భగవంతుని దూతయై (Prophet), లేక అధివక్తయై (Spokesman) నిలువవలయును; నిష్కామమై, ఆతనిచే అనుమోదింపఁబడిన ప్రేరణను ప్రాణములకును ఇంద్రియములకును దెలుపవలయును; తదనుసారమున ప్రాణములును ఇంద్రియములును తమకర్మ నాచరింపవలయును. కర్మత్యాగము మిక్కిలి క్షుద్రమైనది. కామనాత్యాగమే నిజమైన త్యాగము. శరీరముయొక్క నివృత్తి నివృత్తికాదు. బుద్ధియొక్క నిర్లిప్తతయే నిజమైన నివృత్తి.

---

# ఉపనిషత్తులు

మన ధర్మమతి విశాలము. బహువిధములైన శాఖాప్రశాఖలచే శోభితము. దానిమూలము గభీరతమమైన జ్ఞానమునందు నెలకొనియున్నది. దాని శాఖలు కర్మయొక్క అతిదూర ప్రాంతమువఱకును విస్తరించియున్నవి. గీతయందలి అశ్వత్థవృక్షము ఎట్లు ఊర్ధ్వమూలము మఱియు నధఃశాఖమో, అట్లే ఈ ధర్మమును జ్ఞానమునందు పాదుకొనియున్నది, కర్మకు ప్రేరక మగుచున్నది. నివృత్తి దాని పునాది; ప్రవృత్తి దానిగృహము, పైకప్పు, గోడలు; ముక్తి దాని శిఖరము. మానవజాతియొక్క సమస్తజీవనమును విస్తారమైన ఈ హిందూధర్మవృక్షముయొక్క నీడనాశ్రయించినది.

హిందూధర్మముయొక్క పునాది వేద మని అందఱును చెప్పుదురు. కాని కొలఁదిమందియే ఆపునాదియొక్క

స్వరూప రహస్యముల నెఱుంగుదురు. సాధారణముగా మన మందఱము కొమ్మకొనపైఁ గూర్చుండి సుస్వాదములును నశ్వరములును అగు ఏ ఒకటి రెండు ఫలముల ఆస్వాదమునందో ఆమోదపడి యున్నాము. మూలము యొక్క సందర్భ మేదియును మన మెఱుఁగుట లేదు. వేదమున కర్మకాండ యనియు జ్ఞానకాండ యనియు రెండుభాగములు కలవని మనము వినియుండుట నిజమే. కాని అసలు కర్మకాండయన నేమో జ్ఞానకాండ యన నేమో అది మన మెఱుఁగము. మోక్షమూలరుచే వ్రాయఁబడిన ఋగ్వేదవ్యాఖ్యను చదివియుందుము. లేదా రమేశచంద్రదత్తుని వంగానువాదము చదివి యుండవచ్చును. కాని ఋగ్వేద మేమో మనకు తెలియదు. ఋగ్వేదఋషులు ప్రకృతియొక్క బాహ్యపదార్థములనో లేక భూతసముదాయమునో పూజించెడి వారనియు, సూర్యచంద్రాగ్ని వాయువులు మొదలుగాఁగలవాని స్తావకములే సనాతన హిందూధర్మముయొక్క అనాది అనంతము అపౌరుషేయ మనిచెప్పఁబడు మూలజ్ఞానమనియు, మోక్షమూలరుకడను దత్తమహాశయునికడను మనము

నేర్చుకొంటిమి. మనము దీనినే విశ్వసించి వేదఋషులను హిందూధర్మమును అవమానించి, గొప్పవిద్వాంసుల మనియు, జ్ఞానాలోకమును బడసిన వారమనియు (Enlightened) తలపోయుచున్నాము. అసలు వేదమున నిజముగా నేమికలదో, శంకరప్రభృతులైన మహాజ్ఞానులును మహాపురుషులును ఈ స్తావకములను అనాద్యనంతమును సంపూర్ణమును భ్రాంతిరహితమును అగు జ్ఞానముగా నేల స్వీకరించిరో, మన మావిషయ మే మాత్రము బరికించుట లేదు.

ఉపనిషత్తులన నేమో ఆవిషయమునుగూడ కొలఁది మందియే ఎఱుఁగుదురు. ఉపనిషత్తుల మాటచెప్పగా ప్రాయశః మనము శంకరాచార్యుని అద్వైతవాదము, రామానుజుని విశిష్టాద్వైతవాదము, మధ్వుని ద్వైతవాదము మొదలుగాఁగల దార్శనికవ్యాఖ్యల గుఱించియే తలపోయుదుము. అసలు ఉపనిషత్తులం దేమి వ్రాయఁబడియున్నదో, వాని నిజమైన అర్థ మేమో, ఒండొండ విరోధించు షడ్దర్శనము లా ఏకమూలమునుండి ఎట్లుత్ప

న్నములయ్యెనో, షడ్దర్శనములకు మించిన ఏదేని గూఢార్థము ఆ జ్ఞానభాండారమందు లభ్యమగునేమో యను విషయములఁగూర్చి మనము చింతించుట లేదు. శంకరులు చేసిన అర్థమునే మనము వేయేండ్లఁబట్టియు కైకొనియున్నాము. శంకరునివాక్యమే మనకు వేదమును ఉపనిషత్తును. శ్రమచేసి అసలు ఉపనిషత్తుల నెవరు చదువుదురు? ఒకవేళ చదివినను శంకరవ్యాఖ్యకు విరోధముగానున్న ఏవ్యాఖ్యనైనను చూచితిమేని మనము వెంటనే దానిని తప్పని నిరాకరింతుము. అయ్యును ఉపనిషత్తులందు కేవలము శంకరలబ్ధమైన జ్ఞానమే లేదు. భూత వర్తమాన భవిష్యములందే ఆధ్యాత్మికజ్ఞానము లేక తత్త్వజ్ఞానము లబ్ధమైనదో మఱియు కాఁగలదో, ఆసర్వమును ఆర్యఋషులును మహాయోగులును నిగూఢార్థ ప్రకాశకములైన శ్లోకములందు మిక్కిలి సంక్షేపముగా నిలిపిచనినారు.

ఉపనిషత్తులన నేమి? అనాద్యనంతము గభీరతమము సనాతనము నగు ఏ జ్ఞానమునందు సనాతనధర్మము పాదు

కొనియున్నదో ఆ జ్ఞానముయొక్క భాండారమే ఉపనిషత్తులు. నాల్గువేదముల సూక్తము లందును ఈ జ్ఞానము పడయనగును. కాని ఇయ్యది ఉపమ నెపమున స్తోత్రముల బాహ్యార్థమునందు కప్పఁబడియున్నది; జ్ఞాన మిచట, మానవుని ప్రతిబింబము-అద్దమందున్న చందమున. ఉపనిషత్తులు ఆచ్ఛాదనములేని పరమజ్ఞానము; జ్ఞాన మిచట, మానవుని అచ్చు స్వశరీరమువలె. ఋగ్వేదవక్తలైన ఋషులు ఈశ్వరప్రేరణచే ఆధ్యాత్మికజ్ఞానమును శబ్దమునందు, ఛందమునందు బ్రకాశింపఁజేసిరి. ఉపనిషద్ఋషులు సాక్షాద్దర్శనముచే ఆజ్ఞానముఁయొక్క స్వరూపమును దర్శించి, పరమ గభీరార్థములైన కొలఁది మాటలలో దానిని వెలయించిరి. ఉపనిషత్తులందు అద్వైతవాదము మాత్రమే కాదు; భారతదేశమందును, యూరోపునందును, ఏషియాయందును, ఎన్నివిధములైన దార్శనిక పర్యాలోచనలును వాదములును సృష్టింపఁబడినవో, Nominalism, Realism, Nihilism, Darwin's Evolution, Comte's Positivism, Hegel, Kant, Spinoza, Schopenhauer, Utilitarianism, ఈ సర్వ

మును ఉపనిషదృషులచే సాక్షాద్దర్శనమున వీక్షింపఁబడి వ్యక్తముచేయఁబడినవి. కాని ఇతరస్థలములందు ఏది ఆంశికముగా వీక్షింపఁబడినదో, సత్యముయొక్క ఖండము మాత్రమే అయ్యును సంపూర్ణసత్యమని ఏది ప్రచారము చేయఁబడినదో, మఱి ఏది సత్యముయొక్కయు మిథ్యయొక్కయు కలగలుపై తాఱుమాఱుగా వర్ణింపఁబడినదో, అయ్యది ఉపనిషత్తులందు సాకల్యభావమున, తన యథార్థసంబంధమున నిలుపఁబడినది, విశుద్ధమును భ్రమ రహితమును అగుతీరున వెలయింపఁబడియున్నది. కావుననే శంకరుల వ్యాఖ్యయందుఁగాని ఇంకేరి వ్యాఖ్యయందుఁ గాని కట్టుఁబడక, ఉపనిషత్తుల గభీరమును అఖండమును అగు అసలర్థమును గ్రహించుటకై యత్నింపఁదగును.

ఉపనిషత్ శబ్దముయొక్క అర్థము నిగూఢపదమునఁ బ్రవేశించుట. ఋషులు తర్కబలముచేఁగాని, విద్యావైపుల్యముచేఁగాని, ప్రేరణయొక్క ఆవేశముచేఁ గాని ఉపనిషత్తులందు చెప్పఁబడిన జ్ఞానమును బడయ లేదు; ఏ నిగూఢపదమునందు, మనసుయొక్క ఏ అంతః

పురమునందు సమ్యగ్జ్ఞానముయొక్క తాళపుచెవి వ్రేలాడఁగట్టబడినదో, యోగముచే నధికారులై వారా అంతఃపురమునఁ బ్రవేశించి, ఆ చెవిని కైకొని, భ్రాంతి రహితమైన జ్ఞానముయొక్క విశాలరాజ్యమునకు ప్రభువులైరి. ఆ తాళపుచెవి చేఁజిక్కదేని ఉపనిషత్తుల నిజమైన అర్థము బయలుపడదు. తర్కబలముచే ఉపనిషత్తుల నన్వయించుటయు నిబిడారణ్యమందలి మహోన్నత వృక్షముల యగ్రములను క్రొవ్వత్తివెలుఁగుచే నిరీక్షింపఁబోవుటయు ఒకేవిధము. సాక్షాద్దర్శనము సూర్యుని వెలుఁగు. దానివలననే అరణ్యమంతయును వెలుఁగుతో నిండినదై అన్వేషకునకు నయనగోచర మగును. సాక్షాద్దర్శనము యోగముచేతనే పొందఁదగినది.

---

# పురాణము

పూర్వవ్యాసమున ఉపనిషత్తుల విషయము వ్రాసితిమి; మఱియు ఉపనిషత్తులయొక్క యథార్థమును సంపూర్ణమును అగు అర్థమును గ్రహించు మార్గమును జూపించితిమి. ఉపనిషత్తు లే విధముగా హిందూధర్మమునకుఁ బ్రమాణములో అట్లే పురాణములును ప్రమాణములు. శ్రుతి ఎట్లు ప్రమాణమో స్మృతియు నట్లే ప్రమాణము. కాని వీని ప్రామాణ్యమునందు తారతమ్యము గలదు. శ్రుతియొక్కయు ప్రత్యక్షముయొక్కయు ప్రమాణముతో స్మృతి విరోధపడెనేని, స్మృతియొక్క ప్రమాణము గ్రహింపఁదగినది కాదు. యోగసిద్ధులై దివ్యచక్షువును బడసిన ఋషులు దేనిని చూచిరో, అంతర్యామియగు జగద్గురువు వారల విశుద్ధ బుద్ధి కేది విన్పించెనో అదియే శ్రుతి. తరతరముగా రక్షింపఁబడుచు

ఏ ప్రాచీన విద్యాజ్ఞానములు మనలఁ జేరినవో అవియే స్మృతి. కడపటి ఈ జ్ఞానము పెక్కండ్ర వాక్కునందును పెక్కండ్రమతులందును పడి మార్పుచెందినది. అందుచే ఇది మనలఁ జేరుటలో తాఱుమాఱై యుండుట కెంతో అవకాశము కలదు. మఱియు స్థితిగతుల మార్పు ననుసరించి క్రొత్తక్రొత్తమతములు దానితోఁ జేర్పఁబడి యుండును; ఆయాకాలముల అక్కఱల కనుకూలముగా అది క్రొత్త రూపులఁ దాల్చియుండును. కావుననే స్మృతి శ్రుతివలె భ్రాంతిరహితమైన దనుటకు వీలులేదు. స్మృతి అపౌరుషేయముకాదు; మనుష్యుని పరిమితమైనట్టియు పరివర్తనశీలమైనట్టియు మనోబుద్ధుల సృష్టి.

స్మృతులలో పురాణము ముఖ్యము. ఉపనిషత్తుల ఆధ్యాత్మికతత్త్వము పురాణములలో ఉపాఖ్యానముల రూపమునను కథలరూపమునను వర్ణింపఁబడినది. వానియందు భారతదేశముయొక్క ఇతిహాసము, హిందూ ధర్మముయొక్క ఉత్తరోత్తరమగు నభివృద్ధి మఱియు నభివ్యక్తి, పురాతన సమాజముల స్థితి, ఆచారములు,

పూజలు, యోగసాధనలు, చింతాప్రణాళియందలి పెక్కు ప్రధానములైన అంశములు ఇవి లభించును. పురాణకారులు ఇంచుమించు అందఱును సిద్ధులైనను అయియుండిరి, లేదా సాధకులైనను అయియుండిరి. వారిజ్ఞానమును సాధనాలబ్ధమైన వారి ఉపలబ్ధియు వారు రచించిన పురాణములందు వ్రాతరూపమున నిలిచియున్నది. వేదములును ఉపనిషత్తులును హిందూ ధర్మముయొక్క మూలగ్రంథము. పురాణము లాగ్రంథమునకు వ్యాఖ్య. వ్యాఖ్య మూలగ్రంథముతో సమానము కానేరదు. ఒకరి వ్యాఖ్య ఇంకొకరికి సమ్మతము కాకపోవచ్చును. కాని అసలు గ్రంథమును మార్చుటకుఁగాని నిరాకరించుటకుఁగాని ఎవ్వరికిని అధికారములేదు. ఏది వేదములతోను ఉపనిషత్తులతోను మేళవింపఁబడదో అది హిందూ ధర్మముయొక్క అంగముగాఁ గైకొనఁబడఁజాలదు. కాని పురాణములతో మేళవింపఁబడకున్నను నూతనమతము స్వీకరింపఁబడవచ్చును. వ్యాఖ్యయొక్క విలువ వ్యాఖ్యాతయొక్క మేధాశక్తిపై, విద్యాజ్ఞానములపై ఆధారపడియుండును. ఎట్లన వ్యాసదేవునిచే రచితమైన పురాణ

మిప్పుడు నిలిచియుండెనేని, దానికి శ్రుతితో సమానమైన ఆదరము లభించెడిది. అది లేకుండుటచే, మఱియు రోమహర్షణ రచితమైన పురాణము దొరకకుండుటచే, ఇప్పుడు ప్రచారములోనున్న అష్టాదశపురాణముల కన్నింటికిని సమానాదర మొసఁగక, విష్ణు-భాగవత-పురాణములవంటి యోగసిద్ధుల రచనకే హెచ్చువిలువ నొసఁగ వలయును; పండితుఁడును అధ్యాత్మవిద్యాపరాయణుఁడును అగు మార్కండేయ పురాణకర్తవంటి లేఖకుని రచనను శివపురాణముకంటెను అగ్నిపురాణముకంటెను గభీరతరమైన జ్ఞానము కలదానినిగా గ్రహింపవలయును. కాని వ్యాసదేవుని పురాణమే ఆధునికపురాణములకు మూలగ్రంథమగుటచే వీనిలో మిగుల తక్కువదానియందును హిందూధర్మముయొక్క తత్త్వమును ప్రకాశింపఁజేయు పెక్కుసందర్భములు నిలిచియున్నవనుట నిశ్చయము. మఱియు ఒక పురాణము అది తక్కువదే అయినను, జిజ్ఞాసువో భక్తుఁడో లేక యోగాభ్యాసరతుఁడో అగు సాధకుని రచనయగునేని, ఆరచయితయొక్క స్వప్రయాస

లబ్ధమైన జ్ఞానమును పర్యాలోచనయును ఆదరింపఁదగినవే యగును.

వేదములనుండియు ఉపనిషత్తులనుండియు పురాణములను వేఱుపఱచి, వైదికధర్మ మనియు పౌరాణికధర్మ మనియు ఆంగ్లేయశిక్షణము బడసినవారు చేయు మిథ్యాభేదము వట్టిభ్రమ; కేవల మజ్ఞానముచే పుట్టినట్టిది. వేదోపనిషత్తుల జ్ఞానమును సర్వసాధారణులకు బోధచేయును, వ్యాఖ్యానమొనర్చును, విస్తరించి ఆలోచించును. జీవితముయొక్క అతిసామాన్యకృత్యములందును దానిని లగింపఁజేయుకొఱకై యత్నముచేయును—అను హేతువుచేతనే పురాణము హిందూధర్మముయొక్క ప్రమాణములలో నొకటిగా గ్రహింపఁబడుచున్నది. మఱియు నెవ్వరు వేదములను ఉపనిషత్తులను మఱచి, పురాణమునే స్వతంత్రమైనట్టియు చాలినట్టియు ప్రమాణముగాఁ గైకొందురో వారును భ్రాంతులే. హిందూధర్మముయొక్క భ్రాంతిరహితమును అపౌరుషేయమును అగు మూలమును పోవిడుచుటచే భ్రమకును

మిథ్యాజ్ఞానమునకును ఆశ్రయమిచ్చుట యగును. వేదము యొక్క అర్థము లుప్తమై పోవుట తటస్థించును; ఆవిధమున పురాణముయొక్క నిజమైన అర్థమును లుప్తమైపోవును. పురాణములను వేదముపై నిలిపియే నుపయోగించుకొన వలయును.

---

# ప్రాకామ్యము

అష్ట సిద్ధుల విషయము ముచ్చటించినపుడు, యోగప్రాప్తములును అపూర్వములును అలౌకికములును అగు కొన్నిశక్తుల విషయమే లోకులు భావింతురు. అష్ట సిద్ధుల పూర్ణవికాసము యోగులందే చూపట్టు ననుట నిశ్చయము. కాని యీ సకలశక్తులును ప్రకృతియొక్క సాధారణనియమములకు వెలుపలలేవు. ప్రత్యుత మనము వేనిని ప్రకృతినియమము లనుచున్నామో అవి అష్ట సిద్ధుల సమావేశము.

మహిమ, లఘిమ, అణిమ, ప్రాకామ్యము, వ్యాప్తి, ఐశ్వర్యము, వశిత, ఈశిత ఇవి అష్టసిద్ధుల పేర్లు. ఇవియే పరమేశ్వరుని స్వభావసిద్ధములైన అష్టశక్తులని పరిచితములు. ఇందలి ప్రాకామ్యమును గైకొందము; ప్రాకామ్య

మనఁగా సమస్తేంద్రియముల యొక్కయు సంపూర్ణమైన వికాసము, అవ్యాహతమైన వ్యాపారము. వాస్తవము నకు, జ్ఞానేంద్రియ పంచకముయొక్కయు మనస్సు యొక్కయు సకలక్రియలును ప్రాకామ్యము లోనివే. ప్రాకామ్యముయొక్క బలముచే కంటితో చూచు చున్నాము, చెవితో వినుచున్నాము, ముక్కుతో వాసన చూచుచున్నాము, త్వగింద్రియముతో స్పర్శ నను భవించుచున్నాము, నాలుకతో రుచిఁ దెలియుచున్నాము, మనస్సుతో బాహ్యస్పర్శల నన్నిఁటిని గ్రహించు చున్నాము. జ్ఞానధారణశక్తి స్థూలేంద్రియ మందే కలదని సాధారణముగా లోకులు భావింతురు. కాని చూచునది కన్నుకాదనియు మనస్సే చూచుచున్నదనియు, వినునది చెవికాదనియు మనస్సే వినుచున్నదనియు, వాసనచూచు నది ముక్కుకాదనియు మనస్సే వాసనచూచుచున్న దనియు తత్త్వవేత్త ఎఱుఁగును. ఎవరి తత్త్వజ్ఞాన మింకను అధికమో వారు, చూచునట్టిదియు వినునట్టిదియు ఆఘ్రా ణించునట్టిదియు మనస్సుకాదనియు, జీవుఁడే చూచుననియు వినుననియు ఆఘ్రాణించుననియు నెఱుఁగుదురు. జీవుఁడే

జ్ఞాత, జీవుఁడే ఈశ్వరుఁడు, భగవంతుని అంశము; భగవంతుని అష్టసిద్ధులు జీవునియొక్కయు అష్టసిద్ధులు.

మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః,
మనః షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి.
శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయు ర్గంధానివాశయాత్.
శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవచ,
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే.

నాయందలి సనాతనాంశము జీవలోకమున జీవుఁడై, ప్రకృతిలోపలి మనస్సును పంచేంద్రియములను తన కడ కాకర్షించుకొనును. (వానిని తన ఉపభోగమున నియోగించును, తన ఉపభోగముకొఱకై ఆయత్తము చేసికొనును.) జీవరూపియగు నీశ్వరుఁడు శరీరమునఁ బ్రవేశించినప్పుడుగాని శరీరమునుండి వెడలినప్పుడుగాని, వాయువే తీరున పుష్పాదులనుండి గంధమును గైకొనిపోవునో, అట్లే శరీరమందుండి ఇంద్రియములను గైకొని పోవును. శ్రోత్రము, చక్షువు, స్పర్శ, ఆస్వాదము, ఘ్రాణము,

మనస్సు, వీని నధిష్ఠించి ఈ ఈశ్వరుఁడు విషయముల భుజించును. దృష్టి, శ్రవణము, ఆఘ్రాణము, ఆస్వాదనము, స్పర్శ, మననము ఇవియే ప్రాకామ్యము యొక్క క్రియలు. భగవంతుని సనాతనాంశమైన జీవుఁడీ ప్రకృతి క్రియలఁ గైకొని, ప్రకృతివికారమైన సూక్ష్మశరీరమందు పంచేంద్రియములను మనస్సును వికసింపఁ జేయుచున్నాఁడు. స్థూలశరీరమును బడయు సమయమున ఈ షడింద్రియములతో నందుఁ బ్రవేశించుచున్నాఁడు. మృత్యువువేళ ఈ షడింద్రియములఁ గైకొని నిష్క్రమించుచున్నాఁడు. సూక్ష్మదేహమందైనను స్థూలదేహమందైనను ఆతఁడీ షడింద్రియముల నధిష్ఠించి విషయముల ననుభవించుచున్నాఁడు.

కారణదేహమందు ప్రాకామ్యము సంపూర్ణమై యుండును. ఆ శక్తి సూక్ష్మదేహమునందు వికాసము బడసి అటుపై స్థూలదేహమునందు వికసించును; కాని మొదట నుండియు స్థూలమునందు దానికి సంపూర్ణమైన ప్రకాశము లభింపదు. జగతియొక్క క్రమవికాసము

ననుసరించి ఇంద్రియము లన్నియును క్రమముగా వికాస మును బొందును. కడకు కొన్ని జంతువులయందు మనుష్యు నకుఁ గూడ కార్యకారి కాఁదగునంత వికాసతైక్ష్ణ్యముల నవి ప్రాపించుచున్నవి. మనుష్యునందు పంచేంద్రియములు అల్పములును నిస్తేజములును అగుచున్నవి; ఏలన మనము మనోబుద్ధుల వికాసమునందే అధికశక్తిని వినియోగిం తుము. కాని అసంపూర్ణమైన ఈ అభివ్యక్తియే ప్రాకామ్య వికాసముయొక్క కడపటి దశ కాదు. సూక్ష్మదేహమున ప్రాకామ్యమున కెట్టి వికాసము కలదో అట్టి వికాసమునే స్థూలదేహమునందుఁగూడ యోగమువలనఁ బడయ వచ్చును. ఇదియే యోగప్రాప్తమగు ప్రాకామ్య సిద్ధి.

౨

పరమేశ్వరునకు మేర లనునవి లేవు. ఆతని వీఁక దేనిచేతను అడ్డగింపఁబడదు; స్వభావసిద్ధమైన యాతనిశక్తి యొక్క క్షేత్రమును అనంతము, క్రియయు అవ్యాహతము. జీవుఁ డీశ్వరుఁడు; భగవంతుని యంశము; సూక్ష్మదేహము నందును స్థూలదేహమునందును ఆబద్ధుఁడై క్రమముగ

ఈశ్వర శక్తిని వానియందు వికసింపఁ జేయుచున్నాఁడు. స్థూలశరీరమునందలి ఇంద్రియములు మిక్కిలి పరిమితములు. మనుష్యుఁడు స్థూలదేహముయొక్క శక్తియందే బద్ధుఁడై యున్నంతవఱకును బుద్ధివికాసమునందు మాత్రమే పశువు కంటె నుత్కృష్టుఁ డగుచున్నాఁడు. ఏలన ఇంద్రియముల యొక్క తీక్ష్ణతయందును మనస్సుయొక్క అభ్రాంత వ్యాపారమునందును—ఒక్కమాటలో ప్రాకామ్యసిద్ధియందు, పశువే ఉత్కృష్టమైనది. ప్రకృతిశాస్త్రజ్ఞులు దేనిని Instinct అనిపేర్కొనుచున్నారో అది యీ ప్రాకామ్యమే. పశువునందు బుద్ధివికాసము మిక్కిలి కొంచెము; కావున నీ జగమునం దది బ్రతికియుండుటకై ఏదో వృత్తి, బాటఁ జూపునట్టిది, ఏదిచేయఁదగినదో ఏది వర్జింపఁ దగినదో తెలుపునట్టిది, దానికి స్వాయత్తమై యుండవలయును. ఈ కార్యము పశువుయొక్క మనస్సుచేతనే నిర్వర్తింపఁ బడుచున్నది. మానవుని మనస్సు దేనినిఁగాని నిర్ణయింపదు. బుద్ధియే నిశ్చయాత్మకము. బుద్ధియే నిర్ణయించును. మనస్సు కేవలము సంస్కారముల సృష్టించు యంత్రము. మనముచూచునదియు వినునదియు తెలిసికొనునదియు

మనస్సునందు సంస్కారరూపమున పరిణమించును. బుద్ధి ఆ సంస్కారములను గైకొని హేయోపాదేయములను నిర్ణయించును, వివేచన గావించును. పశుబుద్ధి ఇట్టి నిర్ణయ వ్యాపారమునం దసమర్థము. పశువు తెలియుటయు ఆలోచించుటయు బుద్ధితోఁ గాదు, మనస్సుతో. మనస్సున కొక యద్భుతమైన శక్తి కలదు. వేఱొక మనస్సునం దేది కలదో దాని నొక్కక్షణములో గ్రహింపఁ గలదు; విచారణ లేకయే ఏది ఆవశ్యకమో దానిని తెలిసికొనఁ గలదు; మఱియు ఆచరింపఁదగిన క్రియాప్రణాళిని నిర్ణయింపఁగలదు. మన మెవ్వరినిగాని ఇంటఁ బ్రవేశించుచుండఁగా చూడమైతిమి, అయినను ఇంటిలో నెవ్వరో దాఁగియున్నారని మన కెఱుకపడుచున్నది; భయహేతు వేమియును లేదు, అయినను భయపడుచుందుము; ఎచ్చటనో గుప్తమైయున్న భయహేతు వేదో కలదని తోచుచుండును. స్నేహితుఁ డొక్కమాటయైనను ఆడలేదు; ఐనను పలుకక పూర్వమే ఆతఁ డేమిచెప్పునో మనము గ్రహించి యున్నాము. ఈవిధమగు నుదాహరణములింకను అనేకము లీయవచ్చును. ఇదంతయు మనస్సు

యొక్క శక్తి, ఏకాదశేంద్రియముయొక్క స్వాభావిక
మును అవ్యాహతమును ఐన క్రియ. కాని బుద్ధి సాహా
య్యముచే అన్నిపనులను చేయుటకు మనము మిక్కిలి
అలవాటు పడియుండుటచే ఈ క్రియ, ఈ ప్రాకామ్యము,
మనయందించుమించు లోపించినది. పశు వీ ప్రాకామ్యము
నాధారము చేసికొనదేని మూఁడునాళ్లు బ్రతుకలేదు.
ఏది పథ్యమో, ఏది అపథ్యమో, ఎవరు మిత్రులో ఎవరు
శత్రులో, ఎచట భయమో, ఎచట భద్రమో, ప్రాకామ్య
మే పశువునకు గోచరింపఁజేయును. ఈ ప్రాకామ్యము
వలననే కుక్క తన యజమానియొక్క భాష నెఱుఁగని
దయ్యును, ఆతని మాటలయొక్క అర్థమునుగాని ఆతని
మనస్సునందలి భావమునుగాని తెలిసికోఁ గల్గుచున్నది. ఈ
ప్రాకామ్యమువలననే గుఱ్ఱము తా నొకసారి నడచిన
బాటను ఎల్లప్పటికిని గుర్తుపట్ట నేర్చుచున్నది. ఈ ప్రాకామ్య
క్రియలన్నియును మనస్సునందలివి. ఇదిగాక పంచేంద్రియ
ముల శక్తివిషయమునను పశువే మనుష్యు నోడించి
వైచును. మనుష్యుఁ డెవ్వఁడు, కుక్కచందమున కేవలము
పసిపట్టుచు, ఏదేని జంతువు నడచినట్టి బాటను ఇతరజంతు

వుల బాటల నన్నింటినుండియు వేఱుచేసి, నూరుమైళ్లవఱ
కైనను దానిని తప్పిపోకుండ ననుసరింప నేర్చును? లేక
పశువువలె నెవ్వఁడు చీకటియందు చూడ నేర్చును? లేక
కేవలము చెవిసాయముచే దాఁపఁబడియున్న శబ్దహేతు
వును బయలుపఱుప నేర్చును? Telepathy—అనఁగా దూ
రముననున్న వారల భావమును గ్రహించుట—అనుసిద్ధి
విషయమున ఒకానొక ఆంగ్లపత్రిక, అది మనస్సుయొక్క
ప్రక్రియ యనియు, పశువున కాసిద్ధి కలదనియు మనుష్యు
నకు లేదనియు, కావుననే "టెలిపతీ"యొక్క వికాసముచే
మనుష్యున కున్నతికి బదులు అవనతియే కలుగు ననియు
వ్రాసినది. స్థూలబుద్ధి యగు 'బ్రిటను'నకు తగినదే ఈ
తర్కము! మనుష్యుఁడు బుద్ధిని వికసింపఁజేయుకొఱకై
ఏకాదశేంద్రియముల సంపూర్ణవికాసము విషయమున
పరాఙ్ముఖుఁ డగుట అనివార్యము. అట్లగుటచే మేలే కలిగి
నది. కాకుండెనేని, అవసరములేమిచే, అతనిబుద్ధి ఇంత
శీఘ్రముగా వికసించెడిదికాదు. కాని బుద్ధివికాసము
సంపూర్ణముగాను నిశ్చితముగాను కలిగినపిమ్మట, ఏకా
దశేంద్రియములయొక్క పునర్వికాసముకొఱకై యత్నిం

చుట మానవజాతియొక్క కర్తవ్యము. దీనిచే బుద్ధి విచారణకు విషయమయిన జ్ఞానము హెచ్చగును. మనుష్యుఁడును మనోబుద్ధులయొక్క సంపూర్ణవ్యాయామముచే, తనయందంతర్నిహితమైన దేవత్వమును బ్రకాశింపఁజేయుటకు తగినపాత్ర మగును. ఏ శక్తి యొక్క వికాసముగాని అవనతికి హేతువు కాఁజాలదు. శక్తి విధి వ్యతిక్రమముగా ప్రయోగింపఁబడుటచేతను, దబ్బఱఁబాటుపట్టినప్పుడును, సరియగు మేళవింపునుండి తొలఁగియుండుటవలనను అవనతి సంభవించుచున్నది. ఇపుడు చూపట్టు బహుచిహ్నములచే, ఏకాదశేంద్రియముల పునర్వికాసమునకై, అనఁగా ప్రాకామ్యవృద్ధికై ప్రయత్నింపఁదగు దినములు ప్రాప్తించినవని గ్రహింప వీలగుచున్నది.

---

# విశ్వరూపదర్శనము

## గీతయందు విశ్వరూపము :—

వందేమాతరమను వ్యాసమునందు శ్రద్ధేయులగు మామిత్రులు బిపిన్‌చంద్రపాలుగారు, ప్రసంగవశమున విశ్వరూపదర్శనము మాట యెత్తి, గీత ౧౧ వ అధ్యాయమున లిఖితమైన విశ్వరూపదర్శన వర్ణనము సంపూర్ణముగా అసత్యమనియు కవియొక్క కల్పనమాత్రమే అనియు వ్రాసినారు. ఈ మాటను ఖండించవలసిన బాధ్యత మాపైఁ బడుచున్నది. విశ్వరూపదర్శనము గీతయం దత్యంతము ఆవశ్యకమైన అంశము. అర్జునుని మనస్సునందు దుదయించిన సంకోచ సంశయములను శ్రీకృష్ణుఁడు తర్కముతోడను జ్ఞానగర్భితములైన వాక్యములతోడను పరాస్తము చేసినాఁడు. కాని తర్కము ద్వారమునను ఉపదేశము ద్వారమునను లభించిన

జ్ఞానము దృఢముగా నెలకొనదు. ఉపలబ్ధిచే ఏ జ్ఞానము పొడమునో అదియే దృఢముగా పాదుకొనును. కావుననే, అంతర్యామియొక్క అలక్షితప్రేరణకు వశుఁడై, అర్జునుఁడు విశ్వరూపదర్శనముకొఱకై తన కోర్కెను నివేదించుకొనెను. విశ్వరూపదర్శనముచే అర్జునుని సందేహములు శాశ్వతముగా అంతరించిపోయెను; బుద్ధి పరిపూతమై, స్వచ్ఛమై గీతయొక్క పరమరహస్యమును గ్రహించుటకు యోగ్యమయ్యెను. విశ్వరూపదర్శనమునకు పూర్వము గీతయందు తెలుపఁబడిన జ్ఞానము సాధకున కుపయోగించెడునట్టిది, మఱియు జ్ఞానముయొక్క బాహ్యాంగ మనఁదగినది; విశ్వరూపదర్శనానంతరము తెలుపఁబడిన జ్ఞానము గూఢసత్యము, పరమరహస్యము, సనాతనమైన శిక్షణము. ఈ విశ్వరూపదర్శనముయొక్క వర్ణనము కవియొక్క ఉపమ యంటిమేని, గీతయొక్క గాంభీర్యము, సత్యత్వము, అగాధత్వము ఇవన్నియు వినష్టమగును. యోగలబ్ధమును గభీరతమమును అగు దానిశిక్షణము కొన్ని దార్శనికమతములయొక్కయు కొన్ని కవికల్పనలయొక్కయు సన్నివేశముగాఁ బరిణ

మించును. విశ్వరూపదర్శనము కవికల్పన కాదు, ఉపమ కాదు—సత్యము. ప్రకృతికి అతీతమైన సత్యమును కాదు. ఏలన విశ్వప్రకృతియం దంతర్గతమైన విశ్వరూపము ప్రకృత్యతీతము కానేరదు. విశ్వరూపము కారణజగతియందలి సత్యము. కారణజగతియందలి రూపము దివ్యచక్షువునకు గోచరించును. దివ్యచక్షువును బడసిన అర్జునుఁడు కారణజగతియొక్క విశ్వరూపమును వీక్షించెను.

సాకార నిరాకారములు:—

నిర్గుణమును నిరాకారమును అగు బ్రహ్మము నుపాసించువారు గుణములయొక్కయు ఆకారము యొక్కయు వర్ణనమును రూపకమనియు ఉపమయనియు త్రోసిపుత్తురు. సగుణమును నిరాకారమును అగు బ్రహ్మము నుపాసించువారు శాస్త్రములకు యథారూపముకాని వ్యాఖ్యను గావించి నిర్గుణత్వమును నిరాకరింతురు, ఆకారముయొక్క వర్ణనమును రూపకమనియు ఉపమయనియు త్రోసిపుత్తురు. సగుణమును సాకారమును అగు బ్రహ్మము

నుపాసించువారు పై యిరువురిపై కత్తి దూయుదురు. ఈ మూఁడు మతములును పరిమితమును అసంపూర్ణమును అగు జ్ఞానమునుండి పుట్టినవని మేమందుము. ఏలన, ఎవరు బ్రహ్మముయొక్క సాకారమును నిరాకారమును అగు ద్వివిధోపలబ్ధిని బడసిరో వారొకదానిని సత్యమనియు రెండవదానిని అసత్యమైన కల్పన యనియు పల్కి, జ్ఞానము యొక్క పరమ ప్రమాణమును ఎట్లు రూపఱుఁ జేయుదురు? మఱియు ఏవిధమున మేరలులేని బ్రహ్మమును మేరలయందు బంధింతురు? బ్రహ్మముయొక్క నిర్గుణత్వమును నిరాకారత్వమును నిరాకరింతుమేని మనము భగవంతుని న్యూనపఱచు చున్నామనుట నిజము. మఱియు బ్రహ్మముయొక్క సగుణత్వ సాకారత్వములను నిరాకరింతుమేని, ఇందును భగవంతుని న్యూనపఱచు చున్నామనుట నిజము. భగవంతుఁడు రూపమునకు కర్త, స్రష్ట, అధీశ్వరుఁడు. ఆతఁడేరూపమునందును బంధింపఁ బడలేఁడు; కాని ఎట్లు సాకారత్వముచే బంధింపఁబడఁడో, అట్లే నిరాకారత్వముచేతను బంధింపఁబడఁడు. భగవంతుఁడు సర్వశక్తిమంతుఁడు. స్థూలప్రకృతియందు లేక దేశకాలము

లందు మాత్రమే చెల్లుబడియగు నియమములు అను వలను చేతఁగొని, ఆతనిని బంధించు నుద్దేశ్యముతో, "అనంతుఁడ వగుటచే నిన్నంతవంతుని గానీయను, ప్రయత్నముచేసి చూడుము, అది నీచేత కాదు, నీవు మా అభేద్యమైన తర్కముచేతను యుక్తులచేతను—Prospero యొక్క ఇంద్రజాలముచే Ferdinand వలె—బంధింపఁబడి యున్నావు" అని పలుకుట ఎంత హాస్యకరము, ఎంత ఉత్కటమైన అహంకారము, ఎంత దట్టమైన అజ్ఞానము! భగవంతుఁడు బంధనరహితుఁడు. నిరాకారుఁడును సాకారుఁడును. సాధకులకు సాకారుఁడై దర్శన మిచ్చును. ఆ యాకారమునందు పూర్ణుఁడగు భగవంతుఁడు కలఁడు; అయ్యును ఆ సమయమునందే బ్రహ్మాండము నం దంతటను సంపూర్ణముగా వ్యాపించి యున్నాఁడు. ఏలన భగవంతుఁడు దేశకాలాతీతుఁడు. తర్కమున కందరాఁడు. దేశకాలము లతని ఖేలయొక్క సామగ్రి. దేశకాలము లనఁబడు వలను విసరి భూతము లన్నింటిని పట్టుకొని క్రీడించుచున్నాఁడు. మన మా వలతోడనే ఆతని బంధింపఁజాలము. తార్కికమును దార్శనికమును అగు యుక్తులఁ

ప్రయోగించి ఆ అసాధ్యమును సాధించుటకై మనము ప్రయత్నించినపుడెల్ల, క్రీడామయుఁడైన యాతఁడు ఆ మన వలను ఆవలకుఁ ద్రోసి, మనముంగటను, వెనుకను, ఇరుప్రక్కలను, దూరమునను, అన్నివైపులను చిఱునవ్వు లొలికించుచు, తన విశ్వరూపమును తన విశ్వాతీతరూపమును బ్రసరింపఁజేసి బుద్ధి నోడించి వైచుచున్నాఁడు. ఆతనిఁ దెలియఁగలిగితి నని ఎవ్వఁ డనునో అట్టివాఁ డేమియును దెలియనివాఁడు. "నే నెఱుఁగుదును, అయ్యును ఎఱుఁగను," అని ఎవ్వఁ డనునో ఆతఁడే జ్ఞాని.

విశ్వరూపము:—

ఎవఁడు శక్త్యుపాసకుఁడో, ఎవఁడు కర్మయోగియై యంత్రియొక్క యంత్రము చందమున భగవన్నిర్దిష్టమైన కార్యము నాచరించుట కాదేశింపఁబడునో, ఆతఁడు తన కంటితో విశ్వరూపమును దర్శించుట మిక్కిలి ఆవశ్యకము. విశ్వరూపదర్శనమునకు పూర్వమును ఆతఁ డాదేశమును బడసియుండవచ్చును. కాని ఆ దర్శనము లభింపనంతవఱకును, ఆదేశము సరిగా మంజూ రయినట్లు కాదు. దాఖలు

చేయఁబడినది, ప్యాసు చేయఁబడలేదు. అంతవఱకును అతని కర్మయోగశిక్షణమునకును తరిఫీదునకును సమయము. విశ్వరూపదర్శనానంతరము కర్మయొక్క ఆరంభము. విశ్వరూపదర్శనము సాధన ననుసరించియు సాధకుని స్వభావము ననుసరించియు అనేక ప్రకారములు కావచ్చును. కాళియొక్క విశ్వరూపదర్శనమునందు జగమం దంతటను అపురూపమైన నారీరూపమును సాధకుఁడు వీక్షించును. ఏకమయ్యును అయ్యది అసంఖ్యేయమై శరీరములతో విరాజిల్లుచున్నది. ఎల్లెడను కాఱుచీకటుల విరజిమ్ముచు మబ్బువలె నల్లనైన ముంగురుల సమూహము ఆకాశమును కప్పివైచుచున్నది. ఎల్లెడను రక్తసిక్తమైన ఆ ఖడ్గముయొక్క మెఱుపు కంటిని జెదరఁగొట్టుచు నృత్యమొనర్చుచున్నది. జగమం దంతటను ఆ భీషణమైన అట్టహాసముయొక్క ప్రవాహము బ్రహ్మాండములను పిండి చేయుచున్నది. ఈ విషయమంతయు కవియొక్క కల్పన కాదు, ప్రకృత్యతీతమైన యుపలబ్ధిని అసంపూర్ణమైన మానవభాషతో వర్ణించు విఫలయత్నము కాదు. ఇది కాళియొక్క ఆత్మప్రకాశము. ఇది మన తల్లియొక్క

యథార్థస్వరూపము. ఇయ్యది దివ్యచక్షువుచే చూడఁబడినదాని యథాతథమైనట్టియు సరళమైనట్టియు సత్యమైనట్టియు వర్ణన. అర్జునుఁడు కాళియొక్క విశ్వరూపమును చూడలేదు. కాలరూపియగు శ్రీకృష్ణుని సంహారకమైన విశ్వరూపమును జూచినాఁడు. విషయ మొక్కటియే. దివ్యచక్షువుతో చూచినాఁడు. బాహ్యజ్ఞానశూన్యమైన సమాధియందు కాదు. దేని నాతఁడు చూచెనో దానిని వ్యాసదేవుఁ డవికలముగఁ యథాతథముగ వర్ణించెను. ఇది కల కాదు, కల్పన కాదు; సత్యము, జాగ్రత్సత్యము.

కారణజగమునందలి రూపము:—

భగవదధిష్ఠితమైన అవస్థాత్రయముయొక్క విషయము శాస్త్రమున వ్రాయఁబడియున్నది. ఒకటి ప్రాజ్ఞాధిష్ఠితమైన సుషుప్తి, రెండవది తైజసుఁడు లేక హిరణ్యగర్భునిచే అధిష్ఠింపఁబడిన స్వప్నము, మూఁడవది విరాడధిష్ఠితమైన జాగ్రదవస్థ. ఇందలి ప్రత్యవస్థయు ప్రత్యేక జగము. సుషుప్తియందు కారణజగము, స్వప్నమున సూక్ష్మజగము, జాగ్రదవస్థయందు స్థూలజగము. కార

ణాము నం దేది నిర్ణయింపఁబడుచున్నదో, మఱియు మన దేశకాలముల కేది అతీతమో అయ్యది సూక్ష్మమున ప్రతిభాసించుచున్నది, స్థూలమునందు ఆంశికభావమున, స్థూలజగతియొక్క నియమముల ననుసరించి, నిర్వర్తింపఁబడుచున్నది. 'నేను ధార్తరాష్ట్రులను పూర్వమే వధించితిని,' అని శ్రీకృష్ణుఁ డర్జునునితోఁ బలికెను. అయినను స్థూలజగమునందు ధార్తరాష్ట్రు లప్పటికిని యుద్ధక్షేత్రమునం దర్జునుని కెదురై నిలిచియున్నారు; బ్రతికియే యున్నారు; మఱియు యుద్ధకర్మయందు వ్యాపృతులై యున్నారు. భగవంతుని యీమాట అసత్యమును కాదు, ఉపమయును కాదు. కారణజగమునందు వారల నాతఁడు వధించెను, కాదేని ఇహలోకమున వారి వధ అసంభవము. మన యథార్థజీవనము కారణమునందు, దాని ఛాయ మాత్రమే స్థూలమునందు. కాని కారణజగతియందలి నియమములును, దేశకాలములును, నామరూపములును భిన్నములు. విశ్వరూపము కారణమునందలి రూపము. స్థూలమున దివ్యచక్షువునకు గోచరించును.

దివ్యచక్షువు:—

దివ్యచక్షువన నేమి? కల్పనా చక్షువు కాదు. కవియొక్క ఉపమయుఁ గాదు. యోగలబ్ధమగు దృష్టి మూఁడు విధములు: సూక్ష్మదృష్టి, విజ్ఞానచక్షువు, దివ్యచక్షువు. సూక్ష్మదృష్టితో మనము స్వప్నమునందుఁ గాని, జాగ్రదవస్థయందుఁగాని మానసికములగు రూపములను కనుఁగొందుము. సమాధిస్థులమై విజ్ఞానచక్షువుతో సూక్ష్మజగమునందును కారణజగమునందును ఏ నామరూపములు అంతర్గతములై యున్నవో వాని ప్రతిమూర్తులను సాంకేతికరూపములను చిత్తాకాశమునందు వీక్షింతుము. దివ్యచక్షువుతో కారణజగమునందలి నామరూపముల యుపలబ్ధిని బడయుదుము; ఇయ్యవి సమాధియందును ఉపలబ్ధము లగును, స్థూలచక్షువు మూంగటను వీనిని జూడవచ్చును. ఏది స్థూలేంద్రియమున కగోచరమో అది ఇంద్రియగోచర మగునేని దివ్యచక్షువుయొక్క ప్రభావముగా దానిని తెలియవలెను. అర్జునుఁడు దివ్యచక్షువుయొక్క ప్రభావముచే జాగ్రదవస్థయందు భగవంతుని కారణాంతర్గత విశ్వరూపమును జూచి

సందేహము క్షుద్రమయ్యెను. ఈ విశ్వరూపదర్శనము స్థూల జగమున ఇంద్రియగోచరమగు సత్యము కాకపోవుగాక; కాని స్థూలసత్యముకంటెను సత్యము. కల్పనకాని, అసత్యముకాని, ఉపమకాని కాదు.

---

# స్తవ సంకీర్తనము

సాధకుఁడు, సాధనము, సాధ్యము అను ఈ మూఁడంశముల పురస్కరించుకొనియే ధర్మార్థకామమోక్షములు. సాధకుల స్వభావములు వివిధము లగుటచేతనే వివిధములైన సాధనలాదేశింపఁబడినవి; మఱియు వివిధములైన సాధ్యములును అనుసరింపఁబడుచున్నవి. కాని స్థూలదృష్టికి సాధ్యములు నానావిధములై గోచరించినను, సూక్ష్మదృష్టితో చూచినప్పుడు సకలసాధకులకును సాధ్య మొక్కటియే యని బోధపడఁగలదు. ఆత్మతుష్టియే ఆ సాధ్యము. ఉపనిషత్తునందు యాజ్ఞవల్క్యుఁడు తన సహధర్మిణికి బోధించిన బోధ యిది: సకలమును ఆత్మకొఱకే, ఆత్మకొఱకే భార్య, ఆత్మకొఱకే ధనము, ఆత్మకొఱకే ప్రేమ, ఆత్మకొఱకే సుఖము, ఆత్మకొఱకే దుఃఖము, ఆత్మకొఱకే జీవనము, ఆత్మకొఱకే మరణము. కావున ఆత్మ

యనఁగా నేమి అను ప్రశ్న ప్రధానమును ఆవశ్యకమును అగుచున్నది.

విజ్ఞులును పండితులును అగు ననేకులు ఆత్మజ్ఞానమునుగూర్చి బుద్ధి కీ లేనిపోని శ్రమ యేటికి అని పలుకుదురు. ఈ సూక్ష్మవిచారణ అంతయు కాలము నపహరించు వాగ్విడంబరము; సంసారమున కుపయోగపడునట్టియు మానవజాతికి శుభ మొనగూర్చునట్టియు ప్రయత్నములందు పనిచేయుట మేలు—అని వారి యభిప్రాయము. కాని సంసారమున కేయే విషయములు ప్రయోజనీయములో మఱియు మానవజాతికి శుభము దేనివలనఁ గలుగునో ఈ ప్రశ్నలయొక్క మీమాంసయు ఆత్మజ్ఞానముమీఁదనే ఆధారపడి యున్నది. మన జ్ఞానము ననుసరించియే మన సాధ్యము. నేను స్వశరీరమునే ఆత్మగా భావింతునేని, దాని తుష్టి సాధించుకొఱకై ఎల్ల విచారణలను ఎల్ల వివేచనలను నీటఁగలిపి స్వార్థపరమైన నరపిశాచము నగుదును. లేక భార్యనే ఆత్మసమానముగా భావింతునేని, స్త్రీలోలుఁడనై న్యాయాన్యాయ విచారణలను

పోఁద్రోసి ఆపె మనస్తుష్టిని సంపాదించుకొఱకై సర్వప్రాణ
ముతో ప్రయత్నింతును; పరులను కష్టపెట్టియు ఆపెకు
సుఖము చేకూర్తును; పరుల కనిష్ట మొనర్చియైనను ఆపె
యిష్టమును సాధింతును. లేక దేశమునే ఆత్మసమానముగా
తలఁతునేని, గొప్ప దేశభక్తుఁడ నగుదును. ఇతిహాసము
నందు నాకీర్తి అమరమై నిల్చునట్లు బహుశః చేసిపోవు
దును; కాని మిగిలిన ధర్మములను బరిత్యజించి, పరదేశము
లకు హాని, వాని ధనమును కొల్లఁగొట్టుట, వాని స్వాధీనత
నపహరించుట మొదలగుపనులను చేయఁగల్గుదును. లేక
భగవంతునే ఆత్మగా చూతునేని లేక ఆత్మసమానముగాఁ
బ్రేమింతునేని,—ఈ రెండును ఒకటియే, ఏలన ప్రేమయే
చరమదృష్టి—భక్తుఁడనై, యోగినై, నిష్కామకర్మినై
సాధారణ మనుష్యుల కందరాని శక్తి జ్ఞానానందముల
ననుభవింప నేర్తును. లేక నిర్గుణపరబ్రహ్మమునే ఆత్మగా
తెలిసికొందునేని పరమశాంతిని, మఱియు లయమును
బడయనేర్తును. "యో యచ్ఛ్రద్ధః స ఏవ సః"—ఎవని
శ్రద్ధ యెట్టిదో అట్టివాఁడే అతఁడగును. మానవజాతి చిర
కాలమునుండియు సాధనచేయుచు వచ్చుచున్నది. తొలుత

దాని సాధ్యము క్షుద్రము; పిమ్మట పిమ్మట అంతకంటె కొంచెము గొప్పది. కట్టకడపటకు సర్వోచ్చమును పరమము కంటె పరమును అగు సాధ్యమును సాధించి, గంతవ్యస్థాన మగు శ్రీహరి పరమధామమును చేరుటకే ఈతన నడక నంతయు నడచుచున్నది. ఒక యుగమున మానవజాతి కేవలము శారీరకమైన సాధననే గావించెను; శారీరక సాధనమే ఆనాఁటి యుగధర్మము; ఇతర ధర్మములను కొలఁదిపఱచియు శారీరకసాధన మొనర్చుటయే ఆనాఁడు శ్రేయః పథమై యుండెను. ఏలన, అట్లుకాదేని, ధర్మసాధన కుపాయమును ప్రతిష్ఠయు అగు శరీరము ఉత్కర్షను బడయకుండెడిది. అట్లే మఱొక యుగమునందు దారపుత్ర పరివారము, మఱొకయుగమునందు కులము, ఇంకొకయుగమునందు,—ఆధునికయుగమునందువలె—జాతి, ఇయ్యవి సాధ్యములుగాఁ గైకొనఁబడుచున్నవి. సర్వోచ్చమును పరాత్పరమును అగు సాధ్యము పరమేశ్వరుఁడు, భగవంతుఁడు. భగవంతుఁడే యెల్లరకును నిజమైన పరమమైన ఆత్మ; కావుననే నిజమైన పరమమైన సాధ్యము. అందుకనియే గీతయందు, 'సకల ధర్మములను బరిత్యజించి నన్నే స్మరిం

పుము' అని చెప్పఁబడి యున్నది. భగవంతునందు ధర్మము లన్నింటియొక్కయు సమన్వయము. ఆతనిని సాధించినచో ఆతఁడే మన భారము వహించి, మనలను యంత్రముల వలెఁ గావించి, భార్య, కుటుంబము, కులము, జాతి, మానవసమష్టి ఈ అన్నింటికిని పరమతుష్టియు పరమశుభ మును సాధించును.

ఒకే సాధ్యమును సాధించు సాధకులకును స్వభావ ములు భిన్నమగుటచే సాధనలును భిన్న మగును. భగ వత్సాధన కొక ముఖ్యోపాయము స్తవసంకీర్తనము. కాని స్తవసంకీర్తన మెల్లరకును ఉపయోగించు సాధన కాదు. జ్ఞానికి ధ్యానమును సమాధియు మార్గము. కర్మికి కర్మ సమర్పణము శ్రేష్ఠోపాయము. స్తవసంకీర్తనము భక్తి యొక్క అంగము, కాని శ్రేష్ఠాంగము కాదనుట నిజము; ఏలన అహైతుకప్రేమయందే భక్తియొక్క చరమోత్కర్ష. ఆ ప్రేమ భగవత్స్వరూపమును స్తవసంకీర్తనముద్వారమున ఆయత్తమొనర్చుకొని, అటుపై ఆ స్తవసంకీర్తనముయొక్క ప్రయోజనము నతిక్రమించి భగవంతుని స్వరూపభోగము

నందే లీనమై యుండును. అయినను స్తవసంకీర్తనము చేయక ఊరకుండఁజాలు భక్తుఁడు లేఁడు; సాధన కవశ్యము గాకపోయినను సంకీర్తనముచే ప్రాణ ముప్పొంగును. కాని సాధనయే సాధ్యము కాదనియు, మన సాధనయే పరునకును సాధన కాకపోవచ్చుననియు మనము మఱచి పోరాదు. భగవంతుని స్తవసంకీర్తనము చేయనివానిని లేక స్తోత్రశ్రవణమునం దానందమును చూపనివానిని భక్తులు చాలమంది పారమార్థికుఁడు కాఁడని తలఁతురు. ఇది భ్రాంతికిని సంకుచితికిని లక్షణము. బుద్ధుఁడు స్తవసంకీర్తనము చేయఁడయ్యెను. అయినను బుద్ధుఁ డపారమార్థికుఁ డని ఎవ్వరందురు? భక్తిమార్గమునందలి సాధన కొఱకై స్తవసంకీర్తనము సృజింపఁబడినది.

భక్తులలో అనేకవిధములు. అట్లే స్తవసంకీర్తనల ప్రయోగమందును అనేకవిధములు. ఆర్తుఁడగు భక్తుఁడు దుఃఖపువేళ, భగవంతుని మ్రోల నేడ్చుటకై, సాయమును వేఁడుటకై, ఉద్ధరింపఁబడుదు నను. ఆశతో స్తవసంకీర్తనము చేయును. అర్థార్థియగు భక్తుఁడు అభీష్టము సిద్ధించు

నను ఆశతో, ధనము, మానము, సుఖము, ఐశ్వర్యము, జయము, కల్యాణము, భుక్తి, ముక్తి ఇత్యాది నుద్దేశించి స్తవసంకీర్తనము చేయును. ఈ శ్రేణిలోని భక్తు లనేక సమయములందు భగవంతునకు ప్రలోభనము చూపియు ఆతనిని సంతోషపఱుపఁజూతురు. ఒక్కొకఁ డభీష్టసిద్ధి పడయనివాఁడై పరమేశ్వరునిపై మిక్కిలి కోపగించుకొనును; ఆతనిని నిష్ఠురుఁడని కాని, వంచకుఁడని కాని పలు తెఱఁగుల తూలనాడును; మఱియు నిఁక భగవంతుని పూజింపననియు, ఆతని మొగము చూడననియు, ఇఁక ఏ విషయమందును ఆతనిని మన్నింపననియు శపథము చేయును. అనేకులు హతాశులై నాస్తికు లగుదురు; ఈ జగము దుఃఖమున కేలుకోటి యనియు, అన్యాయములకును అత్యాచారములకును ఆటపట్టనియు, భగవంతుఁడు లేఁడనియు సిద్ధాంతము చేయుదురు. ఈ రెండువిధముల భక్తియు అజ్ఞభక్తి; కాని ఆ హేతువుచే నిరసింపఁదగినది కాదు. అది క్షుద్రత్వమునుండి మహత్త్వమున కారోహింపఁగలదు. అవిద్యాసాధనము విద్యకు ప్రథమసోపానము. బాలకుఁడును అజ్ఞుఁడు; కాని బాలకుని అజ్ఞత

యందు మాధుర్యము కలదు. బాలకుఁడును ఏడ్చుటకై తల్లికడఁ జేరును; దుఃఖమునకు ప్రతీకారము కోరును; పలు తెఱఁగుల సుఖములకొఱకై, స్వార్థములకై పరుగిడి వచ్చును, బ్రతిమాలును, పట్టుపట్టి ఏడ్చును; పట్టు నెగ్గదేని కోపించుకొనును; దౌర్జన్యము చేయఁబోవును. జగజ్జననియు నగుమోముతో అజ్ఞభక్తుని ఎల్ల దౌర్జన్యమును మారామును సహించును. జిజ్ఞాసువగు భక్తుఁడు ఏదేని అర్థసిద్ధికిఁగాని భగవంతుని సంతోషపఱచుటకుఁగాని స్తవసంకీర్తనము చేయఁడు. అతని విషయమున స్తవసంకీర్తనము భగవంతుని స్వరూపోపలబ్ధికిని తన భావముయొక్క పుష్టికిని ఉపాయము. జ్ఞానియగు భక్తుని విషయమున ఈ ప్రయోజనమును లేదు; ఏలన అతనికి స్వరూప ముపలబ్ధమైనది, అతని భావము సుదృఢము, సుప్రతిష్ఠితము. కేవలము భావముయొక్క ఉచ్ఛ్వాసము కొఱకే స్తవసంకీర్తనము. ఈ నాల్గుతెఱఁగుల భక్తులును ఉదారులు, ఎవరును ఉపేక్షింపఁదగినవారు కారు, అందఱును భగవంతునికి ప్రియులు. కాని జ్ఞానియగు భక్తుఁడు సర్వశ్రేష్ఠుఁడు; ఏలన జ్ఞానియు భగవంతుఁడును ఒకే ఆత్మ

యని గీత చెప్పుచున్నది. భక్తుని సాధ్యము భగవంతుఁడు; అనఁగా ఆత్మరూపమున ఎఱుఁగఁదగినవాఁడు, పడయఁదగినవాఁడు. జ్ఞానియగు భక్తునకును భగవంతునకును ఆత్మ పరమాత్మల సంబంధము. జ్ఞానము, ప్రేమ, కర్మ అను మూఁడు సూత్రములచే ఆత్మయు పరమాత్మయు పరస్పర మాబద్ధములై యున్నవి. కర్మ కలదు; కాని అది భగవద్దత్తము. దానియందు ఏ ప్రయోజనముగాని, స్వార్థముగాని, తాను కోరఁదగిన దే లేశముగాని లేదు. ప్రేమ కలదు; ఆ ప్రేమయందు కలహముగాని అభిమానముగాని లేదు; మఱియు అది నిఃస్వార్థము, నిష్కళంకము, నిర్మమము. జ్ఞానము కలదు; ఆ జ్ఞానము శుష్కమును భావరహితమును కాదు; గభీరమైనట్టియు తీవ్రమైనట్టియు ఆనందప్రేమములతో అది పరిపూర్ణము. సాధ్య మొక్కటే యయ్యును సాధకు ననుసరించి ఏవిధముగా సాధన భిన్నమగునో, అట్లే వివిధసాధకులచే ఒకే సాధన వివిధముగా ప్రయోగింపఁబడుచున్నది.

---

# నవజన్మము

గీతయందు అర్జునుఁడు శ్రీకృష్ణుని బ్రశ్నించెను: "ఎవరు యోగమార్గమునఁ బ్రవేశించి తుదివఱకును పోఁజాలక తొట్రుపడి యోగభ్రష్టు లగుదురో వారి కేమి గతి ? ఐహికాముష్మికముల రెంటికిని చెడినవారై గాలిచే చెదరఁగొట్టఁబడిన మబ్బువలె వినష్టమై పోవుదురా ?" దానికి సమాధానముగా శ్రీకృష్ణుఁడు ఇట్లు చెప్పెను. "ఇహలోకమునఁ గాని పరలోకమునఁ గాని అట్టివానికి వినాశ మసంభవము. శుభము చేయువాఁ డెన్నఁడును దుర్గతిని బొందఁడు. అతనికి పుణ్యలోకములందు గతి ఏర్పడును. చాలకాల మచట వసించి, శుచిమంతులును శ్రీమంతులును అగు పురుషుల ఇంట, లేదా యోగ యుక్తులైన మహాపురుషుల కులమునందు జన్మించును. ఇట్టి జన్మ మిక్కిలి దుర్లభము. ఈ జన్మమునందు పూర్వ

జన్మప్రాప్తమైన యోగ లిప్సచే ప్రేరితుఁడై సిద్ధికొఱకై మఱియు ప్రయత్నించును. కడపటకు పెక్కు జన్మల అభ్యాసము హేతువుగా పాపవిముక్తుఁడై పరమగతిని చేరును.” పూర్వజన్మవాదము యోగలబ్ధ జ్ఞానముయొక్క అంగవిశేషమై ఆర్యధర్మమునందు చిరకాలమునుండియు స్వీకరింపఁబడుచున్నది. పాశ్చాత్యవిద్యల ప్రభావముచే ఇప్పటి విద్యావంతులలో ఈ వాదముమీఁద విశ్వాస మించుమించు నష్టమై పోయినది. శ్రీరామకృష్ణుని లీల పిదప వేదాంతప్రచారముచేతను గీతాధ్యయనమువలనను ఆ విశ్వాసము తిరిగి నెలకొల్పఁబడుచున్నది. స్థూలజగము నందు Heredity, ‘అనుజాతి’ లేక ‘అనుసంక్రమము’ ఏ విధముగా ప్రధానసత్యమో, అట్లే సూక్ష్మజగమునందు పూర్వజన్మవాదము ప్రధానము. శ్రీకృష్ణుని సమాధాన మందు ఈ రెండుసత్యములును నెలకొని యున్నవి. యోగభ్రష్టుఁడైన పురుషుఁడు తన పూర్వజన్మార్జిత జ్ఞానము యొక్క సంస్కారముతో జన్మించును. ఆ సంస్కారముచే, గాలిచే నడపఁబడు నావచందమున, యోగమార్గమందు ప్రేరింపఁబడును. కాని కర్మఫలప్రాప్తికి తగినట్టి శరీరము

నుత్పన్నము చేయుకొొఅకై తగిన కులమునందు జన్మిం
చుట యవసరము. ఉత్కృష్టమైన Heredity లేక అభి
జనము యోగ్యమైన శరీరమును కల్గించుచున్నది. శుచి
మంతులును శ్రీమంతులును అగు పురుషుల యింట జన్మ
లభించెనేని విశుద్ధమును సబలమును ఐన దేహము లభిం
చుట సంభవించును. యోగుల కులమునందు జన్మించు
టచే ఉత్కృష్టమైన మనఃప్రాణములు నిర్మింపఁబడిన వగును;
మఱియు అనురూపమైన శిక్షయు మానసిక దశయు
ప్రాప్తము లగును.

భారతవర్షమునందు కొన్ని యేండ్లబట్టియు ఒక విష
యము చూపట్టుచున్నది: తమస్సుచే అభిభూతమైన
పురాతన జాతియందు ఒక నూతనజాతి సృష్టియగుట.
భారతమాతయొక్క పూర్వసంతతి ధర్మగ్లానియందును
అధర్మమునందును జన్మించి తదనురూపమైన శిక్షనే పడయు
టచే, అల్పాయువులును, క్షుద్రాశయులును, స్వార్థపరా
యణులును, సంకీర్ణహృదయులును అయి యుండిరి. వారి
నడుమ తేజోవంతులైన మహాత్ములు పెక్కుమంది దేహ

మును గైకొని ఈ విషమ విపత్కాలమందు జాతిని రక్షించిరి. కాని వారు తమ శక్తికిని ప్రతిభకును తగిన పనులను కావింపకయే, జాతియొక్క భావి మహాదశకును ఉదారకర్మలకును క్షేత్రమును మాత్రము సృష్టించి చనిపోయిరి. వారి పుణ్యబలముచేతనే నవోషస్సుయొక్క కిరణమాలలు నలుదిక్కులను ప్రకాశింపఁ జేయుచున్నవి. భారతజననియొక్క నూత్నసంతతి తలిదండ్రుల గుణములనందుకొనక, సాహసులు, తేజోవంతులు, ఉచ్చాశయులు, ఉదారులు, స్వార్థత్యాగులు, పరార్థమునందును దేశహితము సాధించుటయందును ఉత్సాహవంతులు, ఉచ్చమైన కాంక్షతో పరిపూర్ణులు అగుచు జన్మించుచున్నారు. ఆ కారణముచే నేటి యువకబృందము తలిదండ్రులకు స్వాధీనముగాక తమ స్వతంత్రపథమున బోవుట తటస్థించుచున్నది. పెద్దలకును పిన్నలకును మతములందు భేదమును కార్యకాలమునందు విరోధమును కల్గుచున్నది. వృద్ధులు దేవాంశసంభూతులైనట్టియు సత్యయుగమునకు ప్రవర్తకులు కానున్నట్టియు తరుణజనమును స్వార్థముయొక్కయు సంకీర్ణతయొక్కయు హద్దులందు

బంధించి యుంచుటకు కోరుచున్నారు. ఎటులఁగకయే కలికి సాయపడుచున్నారు. ఈ యువకులు మహాశక్తిచే సృజింపఁబడిన అగ్నిస్ఫులింగములు. పురాతనమును బగులఁగొట్టి నూతనమును నిర్మించుటయే వారి యుద్యమము. వారు పితృభక్తికిని విధేయతకును కట్టుపడి యుండఁజాలరు. ఈ దోషమున కుపశమనము భగవంతుఁడే చేయఁగలఁడు, కాని మహాశక్తియొక్క ఇచ్ఛ విఫలము కానేరదు. ఈ నవీన సంతతి ఏమిచేయుటకై వచ్చెనో దానిని సమగ్రముగా సాధింపక మగిడిపోదు. ఐనను ఈ నవీనులయందును పురాతనముయొక్క ప్రభావము కొంత కలదు. నికృష్ట పారంపర్యమువలని జన్మదోషముచేతను, ఆసురిక శిక్షావిధానముయొక్క చెఱుపుచేతను అనేకులు కులాంగారులును కనఁబడుచున్నారు. నవయుగమునకు ప్రవర్తకులగుటకు ఎవ్వరాదేశింపఁబడిరో వారును తమయం దిమిడియున్న తేజఃశక్తులను సరిగా వికసింపఁ జేయలేకున్నారు. కాని సత్యయుగ ప్రకాశమును సూచించు ఈ పూర్వలక్షణము నవీనులయందు చూపట్టుచున్నది—ధర్మమునం దాసక్తి, అనేకుల హృదయములందు యోగాభిలాష, దానితో సగము వికసించిన యోగశక్తి.

ఆలిపూరు బాంబుకేసులో నేరము మోపఁబడిన అశోకనంది కడపటఁజెప్పిన శ్రేణికి చెందినవారిలో నొకఁడు. అతని నెఱిఁగిన వారెవ్వరును ఏవిధమైన కుట్రలోను అతఁడు పాల్గొని యుండెనని నమ్మఁజాలరైరి. మిక్కిలి స్వల్పమైన, అవిశ్వాసయోగ్యమైన సాక్ష్యముమీఁద అతనికి శిక్ష విధింపఁబడెను. అన్య యువకులవలె నతఁడు దేశసేవయొక్క ప్రబలాకాంక్షచే ఆకర్షింపఁబడినవాఁడు కాఁడు. బుద్ధి, చారిత్రము, ప్రాణము ఈ అన్నిఁటియందును అతఁడు సంపూర్ణముగా యోగియు భక్తుఁడును ఐయుండెను. సంసారియొక్క లక్షణములు అతనియందు లేవు. అతని పితామహుఁడు సిద్ధుఁడైన తాంత్రిక యోగి. అతని తండ్రియు యోగలబ్ధమైన శక్తిగల విశిష్ట పురుషుఁడు. గీతయందు యోగులయొక్క కులమందలి ఏ జన్మ మిక్కిలి దుర్లభమైనదిగా వర్ణింపఁబడినదో, భాగ్యవశమున అదియే ఆతనికి ప్రాప్తించెను. చిన్నవయసునందే అతనిలో నిమిడియున్న యోగశక్తియొక్క లక్షణములు ఒక్కొకమారు బయల్పడెడివి. పట్టుకొనఁబడుటకు చాల కాలము పూర్వమే, తనకు యౌవనమునందే మృత్యువు

నిర్దిష్టమై యుండెనని అతఁడు తెలిసికోఁ గల్గెను. కావుననే విద్యార్జనయందుఁ గాని సాంసారికజీవనమునకు వలసిన పూర్వప్రయత్నమందుఁ గాని అతని మనస్సు నిలువ దయ్యెను; అయినను తండ్రియొక్క మాటమీఁద, నెఱవేఱదని యెఱింగియు కర్తవ్యకర్మ మను భావముతోఁ, ఆయన నిర్దేశమును పరిపాలించెను. దానితోపాటు యోగపథమం దారోహించుటకూడ మొదలిడెను. ఇట్టి సందర్భమునం దతఁ డకస్మాత్తుగా పట్టుకోనఁబడెను. కర్మ ఫలముచే కల్గిన ఈ ఆపదవలన కలఁగిపోక, అశోకుఁడు జైలునందు యోగాభ్యాసమున తన సంపూర్ణశక్తిని విని యోగింప మొదలిడెను. ఈ కేసునందలి ముద్దాయిలలో ననేకు లీబాట నవలంబించిరి. వారలలో అతఁ డగ్ర గణ్యుఁడు కాకపోయినను, ఒకానొకఁ డనఁ జెల్లును. భక్తి ప్రేమముల విషయమున అతఁ డెవ్వరికిని తీసిపోయెడి వాఁడు కాఁడు. ఉదారమైన చారిత్రము, గభీరమైన భక్తి, ప్రేమపూర్ణమైన హృదయము, వీనిచే అతఁ డెల్లరి కిని ముచ్చటఁ గొల్పెను. గోస్వామి హత్యసమయమున అతఁడు ఆసుపత్రియందు రోగియైయుండెను. పూర్ణారో

గ్యము లభింపకపూర్వమే నిర్జనకారావాసమునం దుంచఁ బడుటచే మాటిమాటికిని జ్వరపడఁజొచ్చెను. ఈ జ్వర దశయందే గాలిలో చలిరాత్రుల నతఁడు గడపవలసి వచ్చెను. దీనివలన క్షయరోగము కలిగి జీవితాశ లేని దశ ప్రాప్తమయ్యెను. ఈ సమయముననే అతనికి విషమ శిక్ష విధింపఁబడుటచే మరల నతఁడా మృత్యుగృహమైన ఒంటరికొట్టునందే బంధింపఁబడెను. బారిష్టరు శ్రీయుత చిత్తరంజనదాసుగారి వేడికోలుమీద ఆతనిని ఆసుపత్రి లోనికి తీసికొనిపోవు ఏర్పాటు చేయఁబడెను. కాని జామీనుమీద విడుదల దొరకదయ్యెను. కట్టకడపటకు గవర్నరుయొక్క సహృదయతవలన స్వగృహమందు స్వజ నుల సేవఁబడసి మరణించుటకు అతని కనుమతి లభించెను. అప్పీలులో విడుదల యగుటకు పూర్వమే దేహకారా వాసమునుండి భగవంతుఁ డతనిని విడుదల చేసెను. అవ సాన దినములందు అశోకుని యోగశక్తి విలక్షణముగా వృద్ధిపొందెను. మృత్యువునాఁడు విష్ణుశక్తిచే ఆవిష్టుఁడై, ఎల్లరకును ముక్తిదాయకమైన భగవన్నామమును ఉప దేశమును వితరణచేసి, నామకీర్తనమును చేయుచు

చేయుచు అతఁడు దేహమును వీడిపోయెను. పూర్వ జన్మార్జితమైన దుఃఖఫలమును క్షయింపఁజేయుటకై అశోక నందియొక్క జన్మము; ఆ కారణముచే ఈ అనర్థక కష్టమును అకాలమరణమును అతనికి ఘటించెను. సత్యయుగమును ప్రవర్తింపఁజేయుటకు ఏ శక్తి ఆవశ్యకమో, ఆ శక్తి ఆతని శరీరమునం దవతీర్ణము కాలేదు. అయినను స్వాభావికమైన యోగశక్తి ఏ విధమున ప్రకాశించునో అది చూపుట కుజ్జ్వలమైన దృష్టాంతమై అతఁడు వెడలి పోయెను. కర్మయొక్క గతి ఇట్లే యుండును. పుణ్యవంతుఁడు పాపఫలము యొక్క క్షయముకొఱకై స్వల్పకాలము పృథివిపై సంచరించిపోవును. కడపట పాపముక్తుఁడై దుష్టదేహమును వీడి, వేఱొక దేహమును గ్రహించి తనయందంతర్నిహితమైయున్న శక్తికి ప్రకాశమును జీవలోకమునకు హితమును సాధించుటకై వచ్చును.

---

# జాతీయ జాగరణము

మనకు ప్రతిపక్షులైన ఆంగ్లేయులు అన్ని ప్రాంత ములను వ్యాపించిన నేటి ఈ మహాందోళనము ప్రారంభించినది మొదలు దీనిని ద్వేషజనితమని వాక్రుచ్చుచు వచ్చుచున్నారు. వారి ననుకరించుటయందు ప్రియపడు కొందఱు భారతీయులును ఈ మతమును పునరావృత్తి చేయుటలో లోప మేమాత్రమును చేయుట లేదు. మేము ధర్మప్రచారమునందు ప్రవర్తించుచున్నాము. జాత్యుద్ధరణమునకైన ఆందోళనము ధర్మముయొక్క ఒకానొక ప్రధానాంగముగా తలఁచి దానియందు శక్తిని వినియోగించుచున్నాము. ఈ ఆందోళనము ద్వేషజనితమైనచో మేము దీని నెన్నఁడును ధర్మముయొక్క అంగమని ప్రచారము చేయుటకు సాహసించెడివారము కాము. విరోధము, యుద్ధము, చివరకు సంహారము ఇవన్నియు

ధర్మమునకు అంగములు కావచ్చును. కాని ద్వేషమును పరులయెడ హేయబుద్ధియు ధర్మమునకు వెలుపలివి. ఇవి జగముయొక్క క్రమోన్నతి సాధింపఁబడు కొలఁదియు వీడవలసినవి. కావున ఎవరు తమయం దీ వృత్తులను పోషింతురో లేక జాతియందు జాగరిలఁ జేయుటకు యత్నింతురో, వా రజ్ఞానముయొక్క మోహమునందు పడి పాపమున కాశ్రయ మిత్తురు. ఈ ఆందోళన మందే నాఁడును ద్వేషము ప్రవేశింపలేదని మేము చెప్పఁజాలము. ఎప్పుడో కపక్షము అవజ్ఞాద్వేషముల చూపునో, అపుడు రెండవపక్ష మందును దాని ప్రతిఘాతస్వరూపమై ద్వేషమును అవజ్ఞయు ప్రభవించుట అనివార్యము. ఈ పాపముయొక్క సృష్టికి వంగదేశమందలి కొన్ని ఆంగ్లేయవార్తాపత్రికలును ఉద్ధతస్వభావులైన అత్యాచారుల కొందఱి నడతయు బాధ్యత వహింపవలసియున్నది. వార్తాపత్రికలందు దినదినమును అవహేళ, ఏవగింపు, ద్వేషసూచకమైన తిరస్కారము; మఱియు రైలుమీదను, రోడ్డుమీదను, రేవులందును, అంగడులందును దూషణ, అపమానము, కడకు ప్రహారములు.

ఇవన్నియు బహుదినములోర్చియు సహిష్ణువులును ధీర స్వభావులును అగు భారతీయులకే తుదకు మిక్కుటమై పోవుచున్నది. అందుచే దూషణకు మారుదూషణయు ప్రహారమునకు మారుప్రహారమును ఇచ్చుట ఆరంభ మగుచున్నది. ఆంగ్లేయులును అనేకులు ఈ దోషము యొక్కయు అశుభముయొక్కయు ఉత్పత్తికి బాధ్యత తమ దేశీయులదిగా ఒప్పుకొని యున్నారు. అదిగాక చాల దినములనుండియు ఉద్యోగివర్గముకూడ మిక్కిలి దారుణ మైన భ్రమకు లోఁగి, ప్రజల స్వార్థమునకే పనులు విరోధ కములో, వారికేవేవి అసంతృప్తికలిగించునో, ఏవి మర్మ ఘాత కావించునో, అట్టివానినే చేయుచు వచ్చుచున్నారు. మానవుని స్వభావమున క్రోధము వైపునకు వాలు కలదు. స్వార్థముపై దెబ్బపడినప్పుడు, లేక అప్రియ మాచరింపఁబడినప్పుడు, లేక ప్రాణమునకు ప్రియమైన వస్తువుపైఁగాని భావముపైఁగాని దౌర్జన్యము చూపఁబడి నప్పుడు సర్వప్రాణులందును నిహితమైయున్న క్రోధ వహ్ని జ్వాలలై లేచును. క్రోధముయొక్క అతిశయ్యము వలనను దాని అంధగతివలనను ద్వేషమును, ద్వేషజాత

మైన కార్యములును పొడమును. చాలకాలమునుండియు ఆంగ్లేయుల కొందఱి అన్యాయాచరణమువలనను ఉద్ధత వాక్కువలనను మఱియు ఇప్పటి పరిపాలనాతంత్రమం దే విధమైన పదవిగాని అధికారముగాని తమకు లేక పోవుటచేతను భారతీయుల ప్రాణముల లోలోపల అసంతృప్తి చాటున వృద్ధిపొందుచుండెను. కడకు, 'కర్జను' యొక్క పరిపాలనయందు ఈ అసంతృప్తి తీవ్రరూపమును దాల్చి వంగభంగముచే కల్గిన దుస్సహవేదనచే అసాధారణ మైన క్రోధముగా దేశమం దెల్లడను ప్రజ్వలించి, ఉద్యోగివర్గముయొక్క నిగ్రహనీతిఫలముగా ద్వేషమై పరిణమించెను. అనేకులు క్రోధముచే నిలుకు తప్పినవారై ఈ ద్వేషాగ్నికి పుష్కలముగా ఘృతాహుతి నిచ్చిరను మాటఁగూడ స్వీకరింతుము. భగవంతుని లీల మిక్కిలి విచిత్రము. ఆతని సృష్టియందు శుభాశుభముల సంఘట్టనచే జగతియొక్క క్రమోన్నతి నిర్వర్తింపఁబడుచున్నది; ప్రాయికముగా అశుభము శుభమునకు సాయపడుచున్నది; భగవంతున కేది అభీప్సితమో అట్టి శుభమయమైన ఫల మును ప్రసవింపఁ జేయుచున్నది. ఈ ద్వేష మేర్పడుట

అత్యంతము అశుభము. అయినను దానినుండి ఈ శుభ ఫలము—తమస్సునందు పడియున్న భారతీయులందు రాజసికశక్తిని మేల్కొలుపుట కేది ఆవశ్యకమో, అట్టి యుత్కటమైన రాజసికప్రేరణ—ఉత్పన్నమయ్యెను. ఆకారణముచే మేము అశుభమునుగాని అశుభము నాచరించువారలనుగాని ప్రశంసింపఁజాలము. ఎవఁడు రాజసికాహంకారమునకు లోఁగి అశుభమును జేయునో, అతని కార్యము ద్వారమున ఈశ్వరనిర్దిష్టమైన శుభఫలమునకు సాయము కల్గుచున్న దనుహేతువుచే, అతని బాధ్యతకాని కర్మఫలానుభవరూపమైన బంధనముకాని అంతరించిపోవు. ఎవరొక జాతియెడ ద్వేషమును ప్రచారముచేయుదురో వారు భ్రాంతులు. ద్వేషప్రచారముచే కలిగెడు ఫలముకంటె పదిరెట్ల ఫలము నిఃస్వార్థధర్మ ప్రచారముచే కలుగును. దానివలన, అధర్మమును అధర్మజనితమైన పాపఫలభోగమును కలుగుటకు బదులుగా, ధర్మవృద్ధియు అమిశ్రపుణ్యముయొక్క సృష్టియును సంఘటించును. మేము జాతికి జాతిపై పగయును ఏవమును కలిగించు మాటలను వ్రాయము. ఇట్టి అనర్థమును కలిగింపవలదని

ఇతరులనుగూడ వారింతుము. జాతికిని జాతికిని స్వార్థ విరోధ ముదయించి నప్పుడు, లేక అట్టి విరోధము వర్తమానస్థితికి అపరిహార్యమైన అంగస్వరూపమై నిలిచి యున్నప్పుడు, మనము పరజాతియొక్క స్వార్థమును వినష్టము చేయుటకును స్వజాతియొక్క స్వార్థమును సాధించుటకును చట్టము, ధర్మము, నీతి ఈ అన్నింటిం బట్టియు అధికారులము. అత్యాచారముగాని అన్యాయము గాని తటస్థించినప్పుడు, మనము దానిని తీవ్రముగా ఖండించియు, జాతీయశక్తిని దాని కెదురొడ్డియు, సకలవిధ వైధోపాయములచేతను వైధప్రతిరోధముల ద్వారము నను దానిని తొలంగించుటకు చట్టము, ధర్మము, నీతి ఈ అన్నింటింబట్టియు అధికారులము. దేశీయుండుగాని విదేశీ యుండుగాని ఎవ్వండైనను అశుభజనకమైన అన్యాయమును లేక అక్రమ కార్యమును జేసినప్పుడు, లేక అసంగతమైన మతమును బయలుపఱచినప్పుడు, భద్రసమాజోచితమైన ఆచరణకు విరోధింపనిరీతి పరిహాస తిరస్కారములచే ఆ కార్యమునకును మతమునకును ప్రతివాదఖండనముల గావించుట కధికారులము. కాని ఏ జాతియెడంగాని

ఏ వ్యక్తియెడఁగాని అవజ్ఞాద్వేషముల బోషించుటకును సృష్టించుటకును మన మధికారులము కాము. గతమునం దొకవేళ ఇట్టి దోషము ఘటించెనేని అది గతము మాట. ఇఁక ముందీ దోషము ఘటింపకుండుటకై ఎల్లరికిని, ముఖ్యముగా జాతీయపక్షపు వార్తాపత్రికలకును కార్య సాధకులైన యువకబృందమునకును, ఈ ఉపదేశము నిచ్చుచున్నాము.

ఆర్యజ్ఞానము, ఆర్యశిక్ష, ఆర్య ఆదర్శములును మఱియు జడజ్ఞానవాదులును రాజసికులును భోగపరాయణులును ఐన పాశ్చాత్యజాతీయుల జ్ఞానశిక్షాదర్శములును అత్యంతభిన్నములు. యూరోపీయుల మతమునందు స్వార్థముగాని సుఖాన్వేషణముగాని లేనిచో కర్మ ఆచరింపరానిదే అగును. ద్వేషములేనిచో విరోధమును యుద్ధమును అసంభవము. ఒక పక్షమున సకామ కర్మ నాచరింపవలయును; లేదా రెండవపక్షమున కామనాహీనుఁడైన సన్న్యాసియై కూర్చుండవలయును, అనియే వారల యభిప్రాయము; జీవికార్థమైన సంఘర్షణము

మూలమున జగము నిర్మింపఁబడినది, జగముయొక్క క్రమోన్నతి సాధింపఁబడుచున్నది, అనియే వారల విజ్ఞానముయొక్క మూలమంత్రము. ఆర్యులు ఉత్తర కురుభూములనుండి దక్షిణముగా యాత్రచేసి పంచనద భూమిని ఆయత్తము చేసికొనిన నాటి నుండియు ఏ సనాతనశిక్షను ప్రాపించి దానితోపాటు జగమునందు సనాతనప్రతిష్ఠనుగూడఁ బ్రాపించిరో, ఆ సనాతన శిక్ష యిది: ఈ విశ్వ మానందధామము; ప్రేమ, సత్యము, శక్తి వీని వికాసముకొఱకై సర్వవ్యాపకుఁడైన నారాయణుఁడు స్థావరజంగమములందు, మనుష్య పశు కీట పతంగము లందు, సాధువులందును పాపులందును, శత్రువులందును మిత్రులందును, దేవతలందును అసురులందును, ఆత్మ ప్రకాశ మొనర్చుకొని జగద్వ్యాప్తమగు క్రీడను గావించుచున్నాఁడు; క్రీడకొఱకే సుఖదుఃఖములు, క్రీడకొఱకే పాపపుణ్యములు, క్రీడకొఱకే మిత్రత్వ శత్రుత్వములు, క్రీడకొఱకే దేవత్వ అసురత్వములు; మిత్రులు శత్రులు ఎల్లరును క్రీడయందలి సహచరులు; రెండుపక్షములక్రింద విభక్తులై స్వపక్షవిపక్షములను

సృష్టిచేసినారు. ఆర్యుఁడు మిత్రుని రక్షించును, శత్రువుని నిగ్రహించును; కాని ఆతని కాసక్తిలేదు. అతఁ డన్నిఁటను—అన్ని భూతములయందును అన్ని వస్తువులయందును, అన్ని కర్మలయందును, అన్ని ఫలములయందును—నారాయణుని దర్శించి, ఇష్టానిష్టములందును శత్రుమిత్రులందును, సిద్ధియందును అసిద్ధియందును సమభావముతో వర్తించును. సకల పరిణామములును అతనికిష్టమని కాని, సకల జనులును అతనికి మిత్రులని కాని, సకల ఘటనలును అతనికి సుఖదాయకములని కాని, సకల కర్మలును అతని కాచరణీయములని కాని, సకల ఫలములును అతనికి వాంఛనీయములని కాని ఈ చెప్పిన దాని యర్థము కాదు. సంపూర్ణమైన యోగప్రాప్తి లేనిది ద్వంద్వములు ముగియవు. ఆ స్థితి కొలఁదిమందికే చేరనగును. కాని ఆర్యశిక్ష ఆర్యుల సాధారణసంపత్తి. ఆర్యుఁడు ఇష్టమును సాధించుటకును, అనిష్టమును వర్జించుటకును ప్రయత్న మొనర్చును; కాని ఇష్టలాభమునందు జయమదముచే మత్తుఁడు కాఁడు, అనిష్టప్రాప్తియందు జంకిపోఁడు. మిత్రునకు సహాయమును శత్రువునకు పరాజయ

మును ఆతని ప్రయత్నముయొక్క ఉద్దేశ్యములు; కాని ఆతఁడు శత్రువుని ద్వేషింపఁడు, మిత్రునియెడ అన్యాయ పక్షపాతమును వహింపఁడు. కర్తవ్యముయొక్క అనురోధము ననుసరించి స్వజనసంహారమును చేయుటకుఁగూడ సమర్థుఁడు. విపక్షుల ప్రాణరక్షణకై తన ప్రాణములఁగూడ త్యజించుటకు సమర్థుఁడు. సుఖము అతనికి ప్రియము, దుఃఖమతని కప్రియము; కాని అతఁడు సుఖము నం దధీనుఁడు కాఁడు, దుఃఖమునందును అతని ధీరతయు ప్రీతిభావమును చెదరక నిలుచును. అతఁడు పాపమును విడనాడును, పుణ్యమును సేకరించును. కాని పుణ్యకర్మచే గర్వితుఁడు కాడు; పాపమున పడినచో దుర్బలుఁడైన బాలకుని విధమున ఏడ్వఁడు; నవ్వుతో ఆ పంకమునుండి లేచి, బురదను తుడిచి వైచి, ఒడలిని శుభ్రమును శుద్ధమును గావించి తిరిగి ఆత్మోన్నతికై ప్రయత్నపడును. ఆర్యుఁడు కర్మసిద్ధికై అత్యంతము పరిశ్రమించును. వేయి పరాజయములచేతనైనను వెనుకకు పోఁడు. కాని అసిద్ధిచే దుఃఖితుఁడగుటగాని, విషణ్ణుఁడు లేక విరక్తుఁడగుటగాని అతని పట్టున అధర్మము. యోగారూఢుఁడై ఎవఁడు గుణాతీత

భావముతో కర్మ నాచరించుటకు సమర్థుఁ డగునో, అతని పట్టున ద్వంద్వములు అవశ్యము ముగిసిపోవును; జగన్మాత ఏ కార్యము చూపునో, విచారణవినా అతఁడు దానినే చేయును; ఏ ఫలమొసఁగునో ఆనందముతో దానినే భుజించును; స్వపక్షమని ఎవ్వరిని నిర్దేశించునో వారలఁ గైకొని తల్లియొక్క పనుపును నిర్వర్తించును; విపక్షులని ఎవరిని చూపించునో ఆజ్ఞానుసారమున వారిని దమనము చేయును, లేక సంహరించును. ఇదియే ఆర్యశిక్ష. ఈ శిక్షయందు ద్వేషమునకును తృణీకారమునకును తావులేదు. ఎల్లెడను నారాయణుఁడు. ఎవ్వరిని ద్వేషింతును? ఎవ్వరిని తృణీకరింతును ? మనము పాశ్చాత్యభావముతో రాజకీయాందోళనము చేయునప్పుడు ద్వేష తిరస్కారము లనివార్యముగా కలిగినచో, పాశ్చాత్యులమతము నం దవి నింద్యములు కావు; ఏలన స్వార్థములలో విరోధము కలదు, ఉత్థాన మొకపక్షమునకును దమనము రెండవపక్షమునకును తటస్థించుచున్నది. కాని మన ఉత్థానము కేవలము ఆర్యజాతియొక్క ఉత్థానము మాత్రమే కాదు; అది ఆర్యచారిత్రము, ఆర్యశిక్ష, ఆర్యధర్మము ఈ

అన్నింటియొక్కయు ఉత్థానము. ఆందోళనముయొక్క ప్రథమ దశయందు పాశ్చాత్యరాజనీతియొక్క ప్రభావము మిక్కిలి ప్రబలమై యుండెను; అయినప్పటికిని ఆ ప్రథమ దశయందే ఈ పైసత్యము మనకు గోచరించెను. మాతృపూజ, మాతృప్రేమ, ఆర్యాభిమానము వీని తీవ్రానుభవముచే ధర్మప్రధానమైన ద్వితీయ దశ ఏర్పడినది. రాజనీతి ధర్మముయొక్క అంగము. కాని అది ఆర్యభావముతో, ఆర్యధర్మ మనుమోదించెడు ఉపాయములతో ఆచరింపఁబడవలయును. మా భవిష్యదాశయొక్క స్వరూపమైయున్న తరుణబృందమునకు మేము చెప్పున దిది: మీ ప్రాణమందు ద్వేష మున్నచో వెంటనే దాని నున్మూలింపుఁడు. ద్వేషముఁయొక్క తీవ్రమైన ఉత్తేజనచే క్షణికమును రజఃపూర్ణమును అగు భావము సులభముగా జాగరిల్లును, కాని శీఘ్రముగా భగ్నమై పోయి దౌర్బల్యమున పరిణమించును. ఎవరు దేశము నుద్ధరించుటకై కంకణము కట్టుకొని యున్నారో, ప్రాణములను గూడ అర్పనము చేసియున్నారో, వారియందు ప్రబలమైన భ్రాతృభావము, కఠోరమైన ఉద్యమము, లోహసమమైన

దార్ఢ్యము, జాజ్వల్యమానమగు అగ్నియొక్క తేజము, వీనిని సంచరింపఁజేయుఁడు. ఈ శక్తిచే అభగ్నబలము మనకు చేకూరును, చిరవిజయము సిద్ధించును.

---

# గతమును గూర్చిన ప్రశ్న

ఆంగ్లవిద్యా శిక్షితులయందు సుమారు నూటేండ్లు బట్టియు పాశ్చాత్యభావము సంపూర్ణముగా ఆధిపత్యము వహించుటచే భారతీయులు ఆర్యజ్ఞానమునుండియు ఆర్య భావమునుండియు వంచితులై, శక్తిహీనులుగా, పరాశ్రయ ప్రవణులుగా, అనుకరణప్రియులుగా పరిణమించినారు. ఈ తామసికభావము ఇప్పుడే వీడిపోవుచున్నది. ఇది ఎట్లుద్భవించెనో ఆ విషయము నొకమారు చర్చించుట ఆవశ్యకము. పదునెన్మిదవ శతాబ్దమందు తామసిక అజ్ఞానమును ప్రచండ రాజసికప్రవృత్తియు భారతీయులను కబళించెను. దేశమున వేనవేలు స్వార్థపరులును కర్తవ్యపరాఙ్ముఖులును దేశద్రోహులును శక్తిమంతులును అసురస్వభావులును ఐన జనులు జన్మించి పరాధీనత కనుకూలమైన దశను సంసిద్ధమొనర్చిరి. ఆ సమయమున భగవంతుని గూఢసంకల్ప

మును నెఱవేర్చుటకై భారతదేశమున దూర ద్వీపవాసులైన ఆంగ్లేయవర్తకుల ఆవిర్భావము సంఘటించెను. పాపభారముచే క్రుంగిపోవు భరతవర్షము సులభముగా విదేశీయులకు చేఁ జిక్కెను. ఈ అద్భుతఘటనను తలఁచి ప్రపంచము నేటికిని అక్కజపడుచున్నది. దీనికి తృప్తికరమైన ఏ సమాధానమును చెప్పుటకు వీలులేమిచే ఆంగ్లేయజాతియొక్క గుణగణముల నెల్లరును అపరిమితముగా ప్రశంసించుచున్నారు. ఆంగ్లేయజాతియం దనేకగుణములు కలవు; లేదేని పృథివిపై దిగ్విజయ మొనర్చిన జాతులలో వా రగ్రగణ్యులు కాఁజాలెడివారు కారు. కాని భారతీయుల నికృష్టతయు ఆంగ్లేయుల శ్రేష్ఠతయు, భారతీయుల అధర్మమును ఆంగ్లేయుల ధర్మమును ఈ అద్భుతఘటనకు ఏకకారణమని ఎవ్వరందురో, వారు సంపూర్ణముగా భ్రాంతులు కాకపోయినను, భ్రమ లనఁదగిన కొన్ని అభిప్రాయములను ప్రజయొక్క మదియం దుదయింపఁజేసినారు. కావుననే ఈ విషయమును సూక్ష్మముగా పరిశీలించి పొరపాటులేని ఒక నిర్ధారణను చేయుటకై యత్నింపవలయును. గతముయొక్క సూక్ష్మ పరిశీలన

వినా, భవిష్యముయొక్క గతినిర్ణయమును సాధ్యము కాఁజాలదు.

ఆంగ్లేయుల భారతవిజయము జగచ్చరిత్రయందు సాటిలేని ఘటన. ఈ మహాదేశము అనాగరకులు, దుర్బలులు, మూర్ఖులు, అసమర్థులు నగు ప్రజకు నివాసభూమి ఐయుండినచో ఇట్లనుటకు వీలుండదు. కాని భారతవర్షము రాజపుత్రులు, మహారాష్ట్రులు, సిక్కులు, పఠానులు, మొగలులు మొదలైనవారికి వాసభూమి. తీక్ష్ణబుద్ధిగల బంగాళీలును, చింతాశీలులైన దాక్షిణాత్యులును, రాజనీతిజ్ఞులైన మహారాష్ట్రబ్రాహ్మణులును భారతజననియొక్క సంతానము. ఆంగ్లేయుల విజయమునాఁడు నానాఫర్నవీసువంటి కౌశలయుక్తులైన రాజనీతివేత్తలు, మాధోజీ సింధియావంటి యుద్ధవిశారదులైన సేనాపతులు, హైదరాలీ రంజిత్ సింహులవంటి తేజస్వంతులును ప్రతిభాశాలురును ఐన రాజ్యనిర్మాతలు ప్రతి ప్రాంతమందును జన్మించి యుండిరి. పదునెన్మిదవశతాబ్దమునాటి భారతవాసులు తేజమందుఁగాని, శౌర్య

మందుఁగాని, బుద్ధియందుఁగాని ఏజాతికిని తీసిపోయిన వారు కారు. పదునెన్మిదవ శతాబ్దమునాటి భారతభూమి సరస్వతియొక్క మందిరము, లక్ష్మియొక్క భాండారము, శక్తియొక్క క్రీడాస్థానము. అయినప్పటికిని, ప్రబలులును వర్ధిష్ణువులును అయిన ముసల్మానులు శతాబ్దముల తరబడి పోరాడి ఏ దేశమును అతి కష్టముమీఁద జయించియు ఏ నాఁడును నిర్విఘ్నముగా శాసింపలేకపోయిరో, ఆ దేశమే పిడికిటఁ బట్టఁదగినంతమంది ఆంగ్లేయవర్తకుల ఆధిపత్యమును ఏబది ఏండ్లలో అనాయాసముగా స్వీకరించెను; మఱియు నూఱేండ్లనుండియు వారి ఏకచ్ఛత్రసామ్రాజ్యముయొక్క నీడయందు కదలక మెదలక నిద్రించుచుండెను! ఐక్యము లేకపోవుట ఇట్టి పరిణామమునకు కారణమని అంగీకరింతుము; ఐక్యాభావము మన దుర్గతికి ఒక ప్రధానకారణ మనుట నిజమే. కాని భారతవర్షమందు ఏ కాలమందును ఐక్యము లేదు. చంద్రగుప్తుని మఱియు అశోకుని సమయమందును లేదు, ముసల్మానుల భారతవిజయమునాఁడును లేదు, పదునెనిమిదవ శతాబ్దమందును లేదు. ఐక్యము లేకపోవుట ఈ

అద్భుతఘటనకు ఏకమాత్ర కారణము కాఁజాలదు. ఆంగ్లేయుల ధర్మపరత్వమే దీనికి కారణ మనువారల నొక ప్రశ్న అడుగవలసియున్నది. ఆనాటి ఇతిహాసము నెఱిఁగిన యెవ్వరైనను అప్పటి ఆంగ్లేయవర్తకు లప్పటి భారతవాసుల కంటె గుణముచేతఁగాని ధర్మముచేతఁగాని అధికులని చెప్పుటకు సాహసింపఁగలరా? 'క్లైవు,' 'వారన్ హేస్టింగ్సు' మొదలుగాఁగల ఏ ఆంగ్లేయవర్తకులు, దస్యువులు భారత భూమిని జయించి, దూరాడి, జగమున సాటిలేని సాహసమునకును, ఉద్యమమునకును, కుటుంభరిత్వమునకును, మఱియును అట్లే జగమున సాటిలేని దుర్గుణములకును దృష్టాంతము చూపిపోయిరో, నిష్ఠురులు, స్వార్థపరులు, అర్థలోలుపులు, శక్తిమంతులు ఐన ఆ అసురబృందము యొక్క ధర్మము మాట విన్నచో నవ్వు నాపుకొనుట కష్టము. సాహసమును, ఉద్యమమును, కుటుంభరిత్వమును అసురుల గుణము, అసురుల ధర్మము; ఆ ధర్మము 'క్లైవు' మొదలైన ఆంగ్లేయుల కుండెను. కాని వారి అధర్మము భారతీయుల అధర్మముకంటె ఏమాత్రమును తక్కువకాదు. కావున ఆంగ్లేయుల ధర్మపరతచే ఈ అఘటన ఘటించె ననుటకు వీలులేదు.

ఆంగ్లేయులును అసురులై యుండిరి, భారతీయులును అసురులై యుండిరి. అపుడు దేవతలకును అసురులకును యుద్ధము జరుగలేదు, అసురులకును అసురులకును యుద్ధము జరిగెను. కాని ఏ గుణముయొక్క ప్రభావముచే పాశ్చాత్యులగు అసురులయొక్క తేజము, శౌర్యము, బుద్ధి సఫలము లయ్యెను? మఱి ఏ విపరీత దోషముయొక్క ప్రభావముచే భారతీయులగు అసురుల తేజో బుద్ధి శౌర్యములు విఫలము లయ్యెను? మొదటి సమాధాన మిది: భారతీయులు మిగిలిన గుణము లన్నింటి విషయమునను ఆంగ్లేయులతో సమానులయ్యును, వారిలో జాతీయభావము లేకుండెను. ఆంగ్లేయుల యందా గుణము సంపూర్ణముగా వికసించి యుండెను. ఆంగ్లేయులు స్వదేశభక్తులై యుండిరనియు, స్వదేశప్రేమయొక్క ప్రేరణచేతనే భారతదేశమందు విశాల సామ్రాజ్యమును నిర్మించుటకు సమర్థులైరనియు ఈ చెప్పినమాట కర్థముగా ఎవరును గ్రహింపకుందురుగాక. స్వదేశప్రేమయును జాతీయభావమును వేర్వేఱు వృత్తులు. స్వదేశభక్తుడు స్వదేశ సేవాభావముచే ఉన్మత్తుఁడు; అన్నిఁటను

స్వదేశమునే చూచును. స్వదేశము నిష్టదేవతగా భావించి, సకలకార్యములను యజ్ఞరూపమున సమర్పణ మొనర్చి, దేశహితముకొఱకే వాని నాచరించును; దేశముయొక్క స్వార్థమునందు తన స్వార్థమును నిమగ్న మొనర్చివైచును. పదునెన్మిదవ శతాబ్దమందలి ఆంగ్లేయులకు ఈ భావము లేదు. ఈ భావము జడవాది యగు ఏ పాశ్చాత్యజాతి యొక్క ప్రాణమునను స్థాయిరూపమున నిలువఁజాలదు. ఆంగ్లేయులు స్వదేశహితమునకై భారతమునకు రాలేదు, స్వదేశహితమునకై భారతవిజయమును గావింపలేదు; వారు వాణిజ్యముకొఱకును తమ తమ ప్రత్యేక ఆర్థిక లాభముకొఱకును వచ్చియుండిరి. స్వదేశహితము నుద్దేశించి వారు భారతమును జయింపలేదు. ప్రధానముగా స్వార్థసిద్ధికొఱకే వా రా జయమును సాధించిరి. కాని స్వదేశ భక్తులు కాకుండియు వారు జాతీయభావము కలవారై యుండిరి. మా దేశము శ్రేష్ఠమైనది. మా దేశముయొక్క ఆచార విచారములు, నీతి ధర్మములు, బల విక్రమములు, బుద్ధిచారిత్రములు మతకర్మములు ఇవన్నియు ఉత్కృష్టములు, సాటిలేనివి, ఇతరజాతులకు సాధ్యము కానివి—

అను అభిమానము; నా దేశముయొక్క హితమే నా హితము, నా దేశముయొక్క గౌరవముచేతనే నాకు గౌరవము, నా దేశసోదరుల వృద్ధివలననే నేను వృద్ధి బడయఁగలను—అను విశ్వాసము; కేవలము స్వార్థము కొఱకే ప్రయత్నింపక దానితోపాటు దేశముయొక్క స్వార్థమునుగూడ సాధింతును, దేశముయొక్క మానము, గౌరవము, అభివృద్ధి, వీనికొఱకై యుద్ధముచేయుట దేశవాసి యగు ప్రతివానికిని కర్తవ్యము, ఆవశ్యకమైనచో ప్రాణవిసర్జనముచేయుటయు వీరుని ధర్మము—అను కర్తవ్య బుద్ధి: ఇవన్నియు జాతీయభావముయొక్క ప్రధానలక్షణ ములు. జాతీయభావము రాజసికభావము. స్వదేశప్రేమ సాత్త్వికము. ఎవఁడు తన అహమును దేశముయొక్క అహమునందు విలీనము చేయఁజాలునో అతఁడే ఆదర్శ స్వరూపుఁడైన స్వదేశభక్తుఁడు. ఎవఁడు తన అహమును సంపూర్ణముగా రక్షించుకొనుచు తద్ద్వారమున దేశము యొక్క అహమునకుఁగూడ పెంపు కలిగించునో అతఁడు జాతీయభావయుక్తుఁడు. ఆనాఁటి భారతీయులయందు జాతీయభావము నిష్ప్రచ్ఛరము. వా రెప్పుడును జాతి

యొక్క హితమును తలఁపరై రని మే మనుట లేదు. కాని జాతియొక్కయు తమయొక్కయు హితములకు లేశమాత్ర మైనను విరోధము కలిగెనేని, ప్రాయికముగా దేశహిత మును విసర్జించి నిజహితమునే సాధించెడివారు. ఐక్యము యొక్క అభావముకంటె ఈ జాతీయతయొక్క అభావము మా అభిప్రాయమున మిక్కిలి అపత్కరమైన దోషము. పూర్ణమైన జాతీయభావము దేశమందంతటను వ్యాపించె నేని, బహుభేదసంకులమైన ఈ దేశమందును ఐక్యము సాధ్యము. ఐక్యము కావలయును, ఐక్యము కావలయును, అని కేవలము కేకలిడినంతమాత్రముననే ఐక్యము సాధింపఁ బడదు. ఆంగ్లేయుల భారతవిజయమున కిదియే ప్రధాన కారణము; అసురులకును అసురులకును సంఘర్షణ కలిగెను, జాతీయభావాపన్నులును ఐక్యయుక్తులును అగు అసురులు ఇతరగుణములందు తమతో తుల్యులయ్యును జాతీయభావ శూన్యులును ఐక్యభావ శూన్యులును ఐన అసురుల నోడించివైచిరి. నేర్పరియు బలశాలియు అగు వాఁ డెవ్వఁడో అతఁడే కుస్తీయందు జయించును. వేగ వంతుఁడును శ్రమసహిష్ణుపును అగువాఁ డెవ్వఁడో ఆతఁడే

పరుగునందు గమ్యమును మొదట చేరును. ఇది విధాత నియమము. సచ్చరిత్ర కలవాఁడనియు ధర్మపరుఁడనియు ఎవఁడును పరుగునందుఁగాని కుస్తీయందుఁగాని జయింపనేరఁడు. ఏ పనికిఁ దగినసామర్థ్యము దానికి కావలయును. అట్లే జాతీయభావముయొక్క వికాసముచే దుష్ప్రవర్తన గల ఆసురిక జాతియు సామ్రాజ్యస్థాపనమునందు సమర్థమగును. జాతీయతయొక్క అభావముచే చారిత్రవంతమును గుణసంపన్నమును అగు జాతియు కడకు చారిత్రమును గుణమును గోల్పోయి అధోగతిని జేరును.

రాజనీతి వైపునుండి పరీక్షించినచో భారతవిజయము విషయమున ఇదియే సమీచీనమైన విచారణ. కాని దీనియందింకను లోతైన సత్యమొకటి కలదు. తామసికమైన అజ్ఞానమును రాజసికములైన ప్రవృత్తులును భారతమున మిక్కిలి ప్రబలియుండెనని చెప్పితిమి. ఈ దశ పతనమునకు పూర్వదశ. రజోగుణమును సేవించుటచే రాజసికశక్తి వికసించును. కాని కేవలమగు రజస్సు తమస్సునకు శీఘ్రముగా దారితీయును. ఉద్ధతమును నియమశృంఖల లేనిదియు అగు

రాజసికచేష్ట మిక్కిలి శీఘ్రముగా అలసి అవసన్నమై, అప్రవృత్తి, శక్తిహీనత, విషాదము, నిశ్చేష్టత అను నీ గుణములలోనికి పరిణమించును. సత్వముఖ మైనప్పుడే రజఃశక్తి స్థాయి యగును. సాత్వికభావమే లేకపోయినను సాత్వికమగు ఆదర్శమైనను ఆవశ్యకము. ఆ ఆదర్శమువలన రజఃశక్తి నియమితమును స్థాయిబలమును ప్రాపించునదియు అగును. స్వాధీనతయు నియమబద్ధతయు అను నీమేటి సాత్త్వికాదర్శములు రెండును ఆంగ్లేయులకు చిరకాలము నుండియు నిలిచియుండెను. వానిబలముచే ఆంగ్లేయులు ప్రముఖులై చిరజయము నార్జించిరి. పందొమ్మిదవ శతాబ్ద మందు పరోపకారలిప్సయు జాతియందు జాగరితమయ్యెను. దానిబలముచే ఆంగ్లదేశమును ఆంగ్లజాతియు మహాత్త్వముయొక్క ఉత్తమదశకుఁ గైకొని పోఁబడెను. అదిగాక ఏ జ్ఞానతృష్ణయొక్క ప్రబలప్రేరణవలన యూరోపునందు ప్రకృతివిజ్ఞానమున అనేక మహావిషయములను కనిపెట్టఁగల్గిరో, జ్ఞానముయొక్క లేశమాత్రలబ్ధికై వేనవేలు తమప్రాణపర్యంతమును అర్పించుటకు వెనుదీయరైరో, బలిష్ఠమును సాత్వికమును అగు ఆ జ్ఞానతృష్ణ ఆంగ్లజాతి

యందు వికసించెను. ఈ సాత్వికశక్తిచే ఆంగ్లేయులు బలవంతులైరి. ఈ సాత్వికశక్తి క్షీణమగుచున్నది గావుననే, ఆంగ్లేయుల ప్రాధాన్యము, తేజము మఱియు విక్రమము క్షీణమై, భయవిషాదములును స్వశక్తియందవిశ్వాసమును వృద్ధి పొందుచున్నవి; సాత్వికలక్ష్యమునుండి భ్రష్టమైన రజఃశక్తి తమోముఖ మగుచున్నది. ఇటువైపు భారతవాసులును అత్యంతమును సాత్వికజాతిరై యుండిరి; సాత్విక బలముచేతనే జ్ఞానశౌర్యములందును తేజోవీర్యములందును సాటిలేనివారైరి. మఱియు ఐక్యహీనులయ్యును వేలయేండ్ల తరబడి విదేశీయుల ఆక్రమణను అడ్డగించుటకును త్రోసివైచుటకును సమర్థులైరి. తుదకు రజోగుణమునకు వృద్ధియు, సత్వమునకు క్షీణతయు కలుగఁజొచ్చెను. ముసల్మానుల రాక సమయమందు జ్ఞానవిస్తృతి సంకుచితము కాఁదొడఁగెను. రజఃప్రధానమైన రాజపుత్రజాతి అప్పుడు భారతసింహాసనము నధిష్ఠించి యుండెను. ఉత్తరభారతమున యుద్ధము, విగ్రహము, అంతఃకలహములు, వీని ప్రాధాన్యము; వంగదేశమున బౌద్ధధర్మముయొక్క పతనముచే తామసికభావముయొక్క

ప్రాబల్యము. అధ్యాత్మజ్ఞానము దక్షిణభారతమం దాశ్రయము గైకొనెను; ఆ సత్వబలముచే దక్షిణభారత మనేక దినములు స్వాధీనతను రక్షించుకొనుటకు సమర్థమయ్యెను. జ్ఞానతృష్ణయు జ్ఞానముయొక్క ఉన్నతియు తగ్గిపోఁజొచ్చెను. దాని బదులు పాండిత్యముయొక్క అభిమానగౌరవములు పెంపొందఁజొచ్చెను. ఆధ్యాత్మిక జ్ఞానము, యోగశక్తియొక్క వికాసము, ఆంతరమైన ఉపలబ్ధి, వీనిబదులు తామసికమైన పూజలును సకామమును రాజసికమును ఐన వ్రతోద్యాపనములును అధికము కాఁజొచ్చెను. వర్ణాశ్రమధర్మములు లోపింపఁగా లోకులు బాహ్యములైన కర్మాచారములను మిక్కిలి విలువగలవానిఁగా పరిగణింప నారంభించిరి. జాతిధర్మ మిదేవిధమున లుప్తమగుటచేతనే గ్రీసు, రోము, మిసరు, అసిరియాలకు మృత్యువు తటస్థించెను. కాని సనాతనధర్మ మవలంబముగాఁగల ఆర్యజాతిసందర్భమున, ఆ సనాతనమైన దోననుండి సంజీవనియగు సుధాధార నడుమ నడుమ బయలువెడలి, జాతియొక్క ప్రాణమును రక్షించుచుండెను. శంకరుఁడు, రామానుజుఁడు, చైతన్యుఁడు, నానక్, రామ

దాసు, తుకారాం మొదలగువారా అమృతమును చల్లియే, మరణాహతమైన భారతమున ప్రాణసంచారము కలుగఁజేసిరి. అయినను రజస్తమోగుణముల ప్రవాహము మిక్కిలి ప్రబలమై యుండెను. ఆ ప్రవాహవేగముచే ఉత్తమమైనట్టిదియు అధమముగా పరిణమించెను. సాధారణులు శంకరుఁడొసఁగిన జ్ఞానముచేతనే తామసికభావమును సమర్థింప మొదలిడిరి. చైతన్యుని ప్రేమ ధర్మము పరమ తామసికమైన నిశ్చేష్టతకు ఆటపట్టుగా మారెను. రామదాసుకడ శిక్షపడసిన మహారాష్ట్రులు మహారాష్ట్ర ధర్మమును మఱచి, స్వార్థసాధనమందును అంతఃకలహమందును శక్తిని దుర్వినియోగపఱచి, శివాజీ బాజీరావులచే ప్రతిష్ఠింపఁబడిన సామ్రాజ్యమును కూలఁద్రోసిరి. పదునెన్మిదవశతాబ్దమందు రజస్తమముల పూర్ణవేగము చూడనయ్యెను; సమాజమును మతమును ఆధునిక విధానకర్తలు కొందఱు గీసిన గీఁతలలోపల నిలువఁబడి పోయెను. బాహ్యమైన ఆచారములయు కర్మలయు ఆడంబరము ధర్మముపేరిట చెల్లఁజొచ్చెను. ఆర్యజ్ఞాన మించు మించు నశించెను, ఆర్యచారిత్ర మంతరించెను; సనాతనధర్మము

జనసమాజమును బరిత్యజించి, సన్యాసుల అరణ్యవాస మందును భక్తుల హృదయమందును దాఁగుకొనెను. భారత మా నాఁడు తమోగుణముయొక్క కారుచీకటిచే కప్పఁబడిపోయెను; అయినను ప్రచండమైన రాజసిక ప్రవృత్తి ధర్మము బురఖాను తగిలించుకొని, స్వార్థము, పాపము, దేశమున కకల్యాణము, పరుల కనిష్టము, ఈ అన్నిఁటిని తీవ్రవేగముతో సాధించుచుండెను. దేశమున శక్తికి కొఱత లేకుండెను; కాని ఆర్యధర్మము లోపించుటచే మఱియు సత్త్వగుణము లోపించుటచే, ఆ శక్తి తన్నుఁదాఁ గాపాడుకొనఁజాలక వినాశము కాఁజొచ్చెను. కడకు భారతముయొక్క ఆసురికశక్తి ఆంగ్లేయుల ఆసురిక శక్తి వలన ఓడింపఁబడినదై, కట్టుపడి మూర్ఛాగతమై పడిపోయెను. భారతము సంపూర్ణతమోభావముయొక్క అంకమునందు నిద్రితమై వ్రాలెను. అప్రకాశము, అప్రవృత్తి, అజ్ఞానము, అకర్మణ్యత, ఆత్మవిశ్వాసముయొక్క అభావము, ఆత్మ సమ్మానముయొక్క విసర్జనము, దాసత్వమునందు ప్రీతి, పరధర్మసేవ, పరానుకరణము, పరాశ్రయముచే ఆత్మోన్న తికై ప్రయత్నము, విషాదము, ఆత్మనింద, క్షుద్రాశ

యత్వము, ఇట్టి సకలమును తమోభావముయొక్క లక్షణములు. పందొమ్మిదవ శతాబ్ధమందలి భారతమందు ఈ అన్నిటియందును ఏది లేకుండెను? ఆ శతాబ్దముయొక్క ఉద్యమమంతయు ఈ సకలగుణముల ప్రాబల్యముచే, తమఃశక్తి ముద్రచే అంతటను ముద్రిత మయ్యెను.

భగవంతుఁడు భారతమును మేల్కొలిపినప్పుడా ప్రబోధముయొక్క ప్రథమావేగమునందు జాతీయ భావోద్దీపకమైన శక్తి జ్వాలయై జాతియొక్క ప్రతినాళమందును తీవ్రరయముతో సంచరింపఁదొడఁగెను. దానితోపాటు స్వదేశప్రేమయొక్క ఆవేగము ఉన్మాదకరమై యువకబృందము నాక్రమించెను. మనము పాశ్చాత్య జాతివారము కాము, మన మేషియా వాసులము. మనము భారత వాసులము. మన మార్యులము. మనము జాతీయ భావమును జేరినాము. కాని దానియందు స్వదేశప్రేమము ప్రవహింపదేని మన జాతీయభావము పరిస్ఫుటము కాదు. మాతృపూజయే ఆ స్వదేశప్రేమమునకు మొదలు. ఏ నాఁడు బంకిమచంద్రుని 'వందేమాతరమ్' అను గానము

బాహ్యేంద్రియములఁ గడచి చని ప్రాణము నాఘాతిం
చెనో ఆ నాఁడు మనహృదయమందు స్వదేశప్రేమము
మేల్కొనెను, మాతృమూర్తి ప్రతిష్ఠితమయ్యెను. స్వదే
శము మాత, స్వదేశము భగవంతుఁడు అను వేదాంత
బోధయం దంతర్గతమైయున్న మహాశక్తి జాతియొక్క
అభ్యుత్థానమునకు బీజస్వరూప మైనట్టిది. జీవుఁ డెట్లు భగ
వంతుని అంశమో, జీవుని శక్తియు ఎట్లు భగవచ్ఛక్తి
యొక్క అంశమో, అట్లే ఈ ఏడు కోట్ల వంగవాసులును
ఈ ముప్పది మూఁడుకోట్ల భారతవాసులును సమష్టి
మూర్తియు సర్వవ్యాపియు అగు వాసుదేవుని అంశము.
ఈ ముప్పదిమూఁడు కోట్లకును ఆశ్రయమును, శక్తిస్వరూ
పిణియు, బహుభుజాన్విత మఱియు బహుబలధారిణియు
అగు భారతజనని భగవంతుని ఒక శక్తి; మాతయు,
దేవియు, జగజ్జననియు అగు కాళియొక్క ఒక దేహవిశే
షము. ఈ మాతృప్రేమమును మఱియు ఈ మాతృ
మూర్తిని జాతియొక్క మనఃప్రాణములందు జాగరిత
మొనర్చుకొఱకును ప్రతిష్ఠిత మొనర్చుకొఱకును ఈ
కొన్ని యేండ్ల ఉత్తేజనము, ఉద్యమము, కోలాహలము,

అపమానము, ధిక్కారము, పీడనము భగవద్విధానముచే విధింపఁబడినది. ఆపని నెఱవేఱినది, ఇఁకపై నేమి?

ఇఁకపై ఆర్యజాతియొక్క సనాతనశక్తిని మరల సముద్ధరింపవలయును. మొదటిది ఆర్యచారిత్రము, ఆర్య శిక్ష; రెండవది యోగశక్తియొక్క పునర్వికాసము; మూఁడవది ఆర్యోచితమైన జ్ఞానతృష్ణ మఱియు కర్మశక్తి; వీనిద్వారమున నవయుగమున కావశ్యకమైన సామగ్రిని సంచయమొనర్చి, ఈ కొన్ని యేండ్లఁబట్టియు ఉన్మాదకమై వ్యాపించియున్న ఉత్తేజనమును నియమితమును స్థిరలక్ష్యాభిముఖమునుగావించి, మాతృకార్యమును సాధింపవలయును. ఇప్పుడు దేశమందంతటను ఏయువకబృందముఅనుసరింపవలసినబాటకై, ఆచరింపవలసిన పనికై వెదకులాడుచున్నారో, వారు ఉత్తేజనమును గడచి చని శక్తిలాభమునకై మార్గమును వెదకుదురుగాక! ఏ మహాకార్యమును సాధింపవలయునో అది కేవల ముత్తేజనముచే సాధింపఁబడదు. దానికి శక్తి కావలయును. మీ పూర్వపురుషుల శిక్షచే ఏ శక్తి పడయఁదగునో ఆ శక్తి అఘటనా ఘటన పటీయసి. ఆ

శక్తి మీశరీరములం దవతరించుటకు సంసిద్ధమై యున్నది. ఆశక్తియే తల్లి. ఆమెకడ ఆత్మసమర్పణముచేయు ఉపాయమును నేర్చుకొనుఁడు. మిమ్ము యంత్రములఁ గావించి, కడు శీఘ్రముగా, ప్రబలశక్తితో కార్యమును తల్లి సాధింపఁగలదు. అది చూచి ప్రపంచ మక్కజపడఁగలదు. ఆ శక్తి లేదేని మీ సకలప్రయత్నమును విఫలమగును. మాతృమూర్తి మీ హృదయములందు ప్రతిష్ఠింపఁబడినది, మీరు మాతను పూజించుట, మాతనుసేవించుట నేర్చినారు. ఇప్పుడు లోపల నెలకొల్పఁబడియున్న తల్లికడ ఆత్మసమర్పణము గావింపుఁడు. కార్యమును సాధించుట కింకొక మార్గము లేదు.

---

# స్వాధీనతయొక్క అర్థము

స్వాధీనత మన రాజకీయోద్యమముయొక్క ఉద్దేశ్యము. కాని స్వాధీనత అనఁగా నేమి—అను విషయమున అభిప్రాయభేదము లనేకములు గలవు. ఇది స్వాయత్త శాసనమని కొందఱు; కొందఱు ఉపనివేశముల స్వరాజ్యమని; మఱికొందఱు సంపూర్ణస్వరాజ్యమే స్వాధీనత అనుచున్నారు. లౌకికమును ఆధ్యాత్మికమును అగు సంపూర్ణ స్వాధీనత మఱియు తత్ఫలితమైన అఖండానందము, దీనినే ఆర్యఋషులు స్వారాజ్య మనిరి. రాజకీయస్వాతంత్ర్యము స్వారాజ్యముయొక్క ఒకానొక అంగము; దానికి బాహ్య స్వాతంత్ర్యమును ఆంతర స్వాతంత్ర్యమును రెండువైపులు. విదేశీయ శాసనమునుండి సంపూర్ణముగా విమోచింపఁబడుట బాహ్యస్వాతంత్ర్యము. ప్రజాతంత్రమైన ప్రభుత్వము ఆంతరస్వాతంత్ర్యముయొక్క ఉత్తమవికాసము.

ఎన్నాళ్లు పరుల శాసనముకాని రాజత్వముకాని నిలిచి యుండునో, అన్నాళ్లే జాతియను స్వరాజ్యమును బడసిన జాతి యని గాని స్వాధీనజాతి యని గాని పలుకుటకు వీలు లేదు. ఎంతవఱకు ప్రజాతంత్రము స్థాపింపఁబడదో, అంత వఱకును జాతియం దంతర్గతమైన ప్రజను స్వతంత్రు లనుటకు వీలులేదు. మనకు సంపూర్ణ స్వాతంత్ర్యము కావలయును. విదేశీయుల ఆజ్ఞా నిర్బంధములనుండి సంపూర్ణమైన విముక్తి, స్వగృహమందు ప్రజకు సంపూర్ణమైన ఆధిపత్యము, ఇదియే మా రాజకీయ ఆశయము.

ఈ వాంఛకు కారణము సంక్షేపముగా చెప్పుదుము. పరాధీనత ఏ జాతికైనను మృత్యువు యొక్క దూత, మృత్యువుయొక్క ఆజ్ఞాప్రదాత. స్వాధీనతయందే జీవితమునకు రక్షణము, స్వాధీనతయందే ఉన్నతి కవకాశము. స్వధర్మము, అనఁగా స్వభావ నియతమైన జాతీయకర్మయును జాతీయచేష్టయును, జాతీయోన్నతి కేక మార్గము. విదేశీయులు దేశముపై అధికారమును బడసి, వారు చాల దయాళువులే హితేచ్ఛువులే కానిండు, మనతలపై

పరధర్మముయొక్క భారమును మోపక వదలరు. వారి యుద్దేశ్యము మంచిదే ఐనను చెడ్డదే ఐనను వారి ఈ చేతచే అహితముతప్ప హితము మనకు కలుగదు. పర స్వభావ నియతమైన మార్గమందు నడచిపోవుటకు శక్తి గాని ప్రేరణగాని మనకు లేదు. ఆ బాటయందు నడచినచో, మనము మిక్కిలి అందమైనతీరున పరానుకరణము చేయ వచ్చును, పరుల ఉన్నతియొక్క చిహ్నములతోడను వేష భాషలతోడను కడునేర్పుతో మన అవనతిని కప్పుకొన వచ్చును. కాని పరీక్షాకాలము రాఁగా, పరధర్మసేవచే కల్గిన మన దుర్బలతయు అసారతయు బయల్పడును. ఆ అసారత యొక్క ఫలముగా మనము వినాశమును చేరుదుము. 'రోము' యొక్క ఆధిపత్యము క్రింద చేరినట్టియు 'రోము' యొక్క నాగరికతను స్వీకరించినట్టియు ప్రాచీన 'యూరోపీయ'జాతు లన్నియు సుఖముగా స్వచ్ఛందముగా చాలకాలము గడపె ననుమాట నిజము. కాని వారి కడ పటిదశ మిక్కిలి బీభత్సమైనదయ్యెను. మనుష్యత్వమే నశింపఁగా వారికి ఘోరమైన దుర్దశవాటిల్లెను; పరాధీనత యందు నిమగ్నమైన ప్రతిజాతికిని అట్టిదే మనుష్యత్వ

వినాశమును ఘోరదశయు అనివార్యము. పరాధీనతకు మూలకారణము జాతియొక్క స్వధర్మనాశనము, పరధర్మసేవ పరాధీనదశయందు స్వధర్మమును రక్షించుటకు లేక పునర్జీవితమొనర్పుటకు సమర్థులమైతిమేని, పరాధీనత యొక్క బంధనము తనంతట తాను జారిపడిపోవును. ఇది అలంఘనీయమైన ప్రకృతినియమము. కావుననే ఏ జాతి యైనను స్వదోషముచే పరాధీనతయందు పడినచో, అవికలమైనట్టియు సర్వాంగపూర్ణమైనట్టియు స్వరాజ్యము దాని ప్రథమోద్దేశ్యమును రాజకీయాదర్శమును అగుట యుక్తము. ఉపనివేశముల స్వాయత్తశాసనము స్వరాజ్యము కాదు; కాని మినహాయింపులు వినా దానిపూర్ణాధికారమీయఁబడునేని, అదిగాక జాతి తన ఆదర్శమునుండియు స్వధర్మమునుండియు భ్రష్టముకాదేని, అయ్యది స్వరాజ్యమున కనుకూలమైన పూర్వదశ కావచ్చును. బ్రిటిషు సామ్రాజ్యమునకు వెలుపల స్వాతంత్ర్యము పడయు ఆశను పోషించుట ధార్ష్ట్యమును తెలుపుననియు, రాజద్రోహమును సూచించుననియు, మఱియు ఉపనివేశముల కున్న స్వాయత్తశాసనముతో సంతుష్టులు కానివారు నిశ్చయ

ముగా రాజద్రోహులనియు రాష్ట్రవిప్లవకారకులనియు,
అన్నివిధముల రాజకీయకార్యములనుండియు వెలివేయఁ
దగినవారనియు కొందఱు పలుకుచున్నారు. కాని ఈ విధ
మైన ఆశ లేక ఆదర్శముతో రాజద్రోహమున కెట్టి సంబం
ధమును లేదు. ఆంగ్లేయుల ప్రభుత్వముయొక్క ఆరంభము
నుండియు గొప్ప గొప్ప ఆంగ్లరాజనీతివేత్తలు ఇట్టిస్వాధీనత
ఆంగ్లప్రభుత్వాధికారుల లక్ష్యమని చెప్పుచువచ్చిరి. ఇప్పు
డును, స్వాతంత్ర్యాదర్శమును ప్రచారముచేయుటయు
స్వాతంత్ర్యప్రాప్తికై సక్రమమైన ప్రయత్నమును చేయు
టయు శాసనసమ్మతమనియు దోషశూన్యమనియు ఆంగ్ల
న్యాయాధికారులుగూడ విస్పష్టముగ వ్రాయుచున్నారు.
కాని మన స్వాతంత్ర్యము బ్రిటిషు సామ్రాజ్యమునకు
లోపలనా వెలుపలనా అను ప్రశ్నయొక్క చర్చ జాతీయ
వాదు లెన్నఁడును ఆవశ్యకముగా తలఁపలేదు. మనము
సర్వాంగపూర్ణమైన స్వరాజ్యమును కోరుచున్నాము.
బ్రిటిషువారు తమ సామ్రాజ్యముయొక్క వ్యవస్థను
మార్చి దానియందు నిలిచిన భారతీయులకును పైనిర్దేశిం
చిన స్వరాజ్యమును సాధ్యపడఁజేయుదురేని, ఆపత్తి

ఏ మున్నది? మే మాంగ్లజాతియెడ ద్వేషముచే స్వరాజ్యమునకై ప్రయత్నించుటలేదు, దేశరక్షణకై చేయుచున్నాము; కాని మేము సర్వాంగపూర్ణమైన స్వరాజ్యము వినా అన్యాదర్శములను స్వీకరించి, దేశవాసులకు బూటకపురాజనీతియు, దేశరక్షణ కపమార్గమును చూపుటకు సంసిద్ధులము కాము. కావుననే కాంగ్రెసు 'క్రీడ్' విషయమున జాతీయవాదుల కాపత్తి.

---

# దేశము, జాతీయత

జాతీయతకు దేశము పునాది; జాతికాదు, ధర్మము కాదు, మఱి ఇంకేదియును కాదు, కేవలము దేశమే. జాతీయతయొక్క మిగిలిన ఉపకరణములన్నియు గౌణములును ఉపకారకములును మాత్రము, దేశమే ముఖ్యమైనది, ఆవశ్యకమైనది. పరస్పరము విరోధించు పెక్కుజాతు లొక్క దేశమందు నివసించును. సద్భావము, ఐక్యము, మైత్రి వారి కెన్నఁడును లేవు. కాని దానివలన భయమేమి? దేశ మెప్పుడొక్కటియో, తల్లి ఒక్కతెయో, ఎప్పుడో ఒకనాఁ డైక్యము కలుగనే కలుగును;. అనేకజాతుల మిశనముచే బలిష్ఠమును అజేయమును ఐన ఏకజాతి ఏర్పడును. ధర్మములును మతములును ఒకటి కావు; సంప్రదాయమునందును సంప్రదాయమునందును చిరవిరోధము; కలియికలేదు; కలియికయొక్క ఆశయును

లేదు.— అయినను భయములేదు. ఏ నాఁడో స్వదేశ మూర్తిధారిణియగు తల్లియొక్క ప్రబ లాకర్షణముచే, ఛలముచే లేక బలముచే, సామముచే లేక దండముచే, లేక దానముచే కలియిక కలుగనే కలుగును; సంప్రదాయము లందలిభేదములు భ్రాతృభావమునందును మాతృప్రేమయందును లీనమైపోవును. ఒక్కదేశమం దనేక భాషలు, సోదరుఁడు సోదరునిమాట తెలిసికోఁజాలఁడు, ఒకరొకరి భావమందు ప్రవేశింపలేరు, హృదయము హృదయముతో ఏక మగు బాటపై అభేద్యమైన ప్రాకారము నిలిచియున్నది, మిక్కిలి కష్టముమీఁదగాని దాటుటకు సాధ్యముకాదు—అయినను భయములేదు. ఒకే దేశము, ఒకే జీవనము, ఎల్లరి మదులందును ఒకే చింతాప్రవాహము. అక్కఱయొక్క ప్రేరణచే ఎల్లరకును సాధారణమైన భాష ఏర్పడి తీరును. ఇపు డున్నభాషలలో ఒక భాషయొక్క ఆధిపత్యము స్వీకరింపఁబడును, లేదా నూతన భాష సృష్టింపఁబడును. తల్లిమందిరమం దెల్లరును ఆ భాషనే వ్యవహరింతురు. ఈ సకలవిధములైన ఆటంకములును ఎల్లకాలమును అడ్డగింపవు. తల్లిఅక్కఱ, తల్లిఆకర్షణ,

తల్లిప్రాణవాసన ఇవన్నియు విఫలముకావు. ఇవి అన్ని అవరోధములను అన్ని విరోధములను అతిక్రమించును, నశింపఁజేయును, కృతార్థములై తీరును. ఒకే తల్లి గర్భమందు జన్మ సంభవించినది. ఒకే తల్లియొక్క అంకమందు నివసించుచున్నాము. ఒకే తల్లియొక్క పంచభూతములందు కలిసిపోవుదుము. అంతరమందు వేయి వివాదలున్నను తల్లి పిలుపుచే కలియఁగలము. ఇది ప్రకృతి నియమము. సర్వదేశముల యొక్క ఇతిహాసములును నేర్పు పాఠ మిదియే. జాతీయతకు దేశమే పునాది. ఈ రెంటికిని తప్పని సంబంధము. స్వదేశ మున్నచో జాతీయత ఉండి తీరవలయును. ఒకే దేశమందు రెండుజాతులు చిరకాలమును ఉండఁజాలవు, కలిసియే తీరును. మఱియును దేశ మొక్కటికాక, జాతి, ధర్మము, భాష ఒక్కటే అగుఁగాక, దానివలన ఏమాత్రమును ఫలములేదు; ఎప్పుడో ఒకప్పుడు భిన్నజాతి సృష్టింపఁబడుట తప్పదు. వేర్వేఱు దేశములను కలిపి ఒక మహాసామ్రాజ్యమును నిర్మింపవచ్చును, కాని ఒకమహాజాతిని నిర్మింపవీలుకాదు. సామ్రాజ్యము ధ్వంసముకాఁగా మరల భిన్నజాతు లేర్ప

డును. అంతర్నిహితమైన ఆ స్వాభావికభేదమే సామ్రాజ్య నాశనమున కనేక పర్యాయములు కారణమగుచున్నది.

కాని ఈ జాతీయత అవశ్యంభావియే అయ్యును, మనుష్యుని ప్రయత్నమువలనను అతని బుద్ధివలనను, ఒక వేళ వీనితోడ్పాటు లేకున్నను అనివార్యమైన ప్రకృతి నియమముచేతనే, అది త్వరగానో లేక ఆలస్యముగానో ఆవిర్భవించుట తటస్థించును. మన దేశమందెన్నడును ఐక్యమేర్పడలేదు. కాని చిరకాలమునుండియు ఐక్యము వైపున కాకర్షణ మఱియు ప్రవణత. మన ఇతిహాసమందు భారతముయొక్క వివిధభాగములను ఏకమొనర్చు ప్రయత్నము చూపట్టుచున్నది. ఈ స్వాభావిక ప్రయత్నమునకు కొన్ని ప్రధానములైన అంతరాయము లెదురయ్యెను. మొదటిది ప్రాదేశిక విభేదము; రెండవది హిందూ ముసల్మానుల విరోధము; మూడవది మాతృదర్శనముయొక్క అభావము. దేశముయొక్క మహావిస్తృతి; రాకపోకల యందలి ప్రయాస, కాలవిలంబము; భాషల వైవిధ్యము: ఇవన్నియు ప్రాదేశికవిభేదమునకు ముఖ్యసహాయకారులు.

కడపటి అంతరాయముతప్ప మిగిలిన అంతరాయము లన్నియును ఆధునిక ప్రకృతివిజ్ఞానమువలన ఏర్పడిన సౌకర్యములచేత బలములేనివై పడిపోయినవి. హిందూ ముసల్మానుల విరోధ మున్నను, భారతము నేకీకరించుటకు 'అక్బరు' సమర్థుఁ డయ్యెను. 'ఔరంగజీబు'యొక్క బుద్ధి నికృష్టమైన రాజనీతికి వశముకాకుండెనేని, కాలమహిమచేతను, అభ్యాస బలముచేతను, విదేశీయుల దాడి వలని భయముచేతను, ఇంగ్లండునందలి 'కాథలిక్' 'ప్రాటెస్టెంటుల' విధముననే, భారతమందును హిందూ ముసల్మానులు శాశ్వతముగా ఏకమయ్యెడివారు. ఆతని బుద్ధిదోషమువలనను కూటబుద్ధిగల ఇప్పటి కొందఱి ఆంగ్లేయ రాజనీతిజ్ఞుల ప్రేరేపణవలనను ఆ విరోధము ప్రజ్వలించి చల్లారకున్నది. కాని ముఖ్యమైన అంతరాయము మాతృదర్శనముయొక్క అభావము. మన రాజనీతిజ్ఞులు ప్రాయికముగా మాతయొక్క సంపూర్ణస్వరూపమును దర్శించుటకసమర్థులైరి. రంజితసింహుఁడును గురుగోవిందుఁడును భారతమాతను వీక్షింపక పంచనదమాతను వీక్షించిరి. శివాజీయును బాజీరావును భారతమాతను వీక్షింపక

హిందూమాతను వీక్షించిరి. ఇతర మహారాష్ట్రీయ రాజనీతిజ్ఞులు మహారాష్ట్రమాతను వీక్షించిరి. మనకును వంగభంగమునాఁడు వంగమాతయొక్క దర్శనము లభించినది. ఆ దర్శన మఖండ దర్శనము. కావుననే వంగదేశముయొక్క భవిష్య దైక్యమును భవిష్య దౌన్నత్యమును అనివార్యములు. కాని భారతమాతయొక్క అఖండమూర్తి ఇప్పటికిని ప్రకాశముకాలేదు. కాంగ్రెసునందు ఏ భారతమాతను బహువిధములైన స్తవసంకీర్తనములతో పూజించితిమో ఆపె కల్పితమూర్తి. ఆపె ఆంగ్లేయుల సహచరి, ప్రియదాసి, మ్లేచ్ఛ వేషభూషాలంకృతయైన దానవమాయ. ఆపె మన తల్లి కాదు. మన నిజము తల్లి ఆపె వెనుక దట్టమును అస్పష్టమును ఐన వెలుఁగునందు దాఁగుకొని మన మనఃప్రాణముల నాకర్షించుచున్నది. ఏ నాఁడు అఖండస్వరూపమైన మాతృమూర్తిని దర్శింతుమో, ఆపె రూప లావణ్యముచే పరవశులమై ఆపె కార్యమందు జీవితమును సమర్పించు వేగముతో ఉన్మత్తుల మగుదుమో, ఆ నాఁడీ అంతరాయము తిరోహిత మగును, భారతముయొక్క ఐక్యము, స్వాతం

త్ర్యము, ఔన్నత్యము సహజసాధ్యము లగును. భాషా భేదమువలన ఇఁక ఇబ్బంది యుండదు. ఎల్లరును తమ తమ మాతృభాషను కాపాడుకొనుచు, సాధారణభాషగా హిందీభాషను గ్రహించి ఆ అంతరాయమును నశింపఁ జేయుదురు. హిందూ ముసల్మాను భేదమునకు యథార్థమైన నివారణోపాయమును కనుఁగొనువిషయమునను ఇఁక సమర్థుల మగుదుము. మాతృదర్శనము కలుగకపోవుటచే ఈ అంతరాయమును నశింపఁజేయఁగల బలవదిచ్ఛ కలుగ కున్నది; కావుననే ఉపాయము భావింపఁబడకున్నది, విరోధము తీవ్రమై సాగుచున్నది. కాని ఆమె అఖండ స్వరూపమును దర్శింపవలయును. హిందువులమాతగా, హిందూజాతీయత కాధారముగా మాతృదర్శన వాంఛను పోషింతుమేని, మరల మన మా పూర్వపు భ్రమ యందేపడి జాతీయతయొక్క సంపూర్ణ వికాసమును చూడ నోచని వార మగుదుము.

---

# మా ఆశ

మనకు బాహుబలము లేదు, యుద్ధసామగ్రి లేదు, శిక్షణము లేదు, రాజశక్తి లేదు. ఇంక దేనివలన మనఆశ? ఏ బలముచూచుకొని మనము సుశిక్షితమైన యూరోపీయజాతి కసాధ్యమైన కార్యమును సాధింప ప్రయాసపడుచున్నాము? ఇది పిన్నల ఉద్దామ దురాశ; ఉచ్చాదర్శముయొక్క మాదనముచే ఉన్మత్తులైన అవివేకుల శూన్యస్వప్నము. స్వాతంత్ర్యప్రాప్తికి యుద్ధ మొక్కటియే మార్గము, మనము యుద్ధముచేయుట కసమర్థులము—అని పండితులును విజ్ఞులును పల్కుచున్నారు. యుద్ధముచేయుట కసమర్థుల మని ఒప్పుకొనుచున్నాము. మేమును యుద్ధముచేయు మని సలహాయిచ్చుటలేదు. కాని బాహుబలమే శక్తి కాధారము—అనుటయే నిజమా, లేక ఇంకను గూఢమైన గభీరమైన మూలమందుండి శక్తి

బయలువెడలునా? కేవలము బాహుబలముచేతనే ఏ మహాకార్యమును సాధింపఁబడుట అసాధ్యమని ఎల్లరును అంగీకరింపక తప్పదు. పరస్పరమును విరోధపడు సమాన బలశాలు రిర్వురకు శక్తిసంఘర్షణ కలిగెనేని, ఎవరి నైతిక మానసిక బల మధికమో, ఎవరి ఐక్యము, సాహసము, అధ్యవసాయము, ఉత్సాహము, దృఢప్రతిజ్ఞ, స్వార్థత్యాగము ఉత్కృష్టమో, ఎవరి విద్య, బుద్ధి, చతురత, తీక్ష్ణదృష్టి, దూరదర్శిత, ఉపాయోద్భావనాశక్తి ఇవి వికసించినవో, ఆ పక్షమునకే జయము నిశ్చయము. బాహుబలమందును, సంఖ్యయందును, సామగ్రియందును తక్కువవాఁడును నైతిక మానసిక బలముల ఆధిక్యముచే ప్రబల విరోధినిగూడ నోడింపనేర్చును. దీనికి దృష్టాంతము లితిహాసముయొక్క ప్రతిపుటయందును నిలిచియున్నవి. ఔను, బాహుబలముకంటె నైతికమానసికబలములకు గురుత్వము కలదు; కాని బాహుబలములేనిదే నైతిక మానసిక బలముల రక్షించున దేది?—అని మీా రన వచ్చును. నిజమే ఆమాట. కాని ఇదియును ఎఱిఁగిన విషయమే: రెండు విచారణామార్గములు, రెండు సంప్రదాయ

ములు, పరస్పరము విరోధపడు రెండునాగరకతలు, వీనికి సంఘర్షణ మేర్పడినప్పుడు, ఏపక్షమున బాహుబలము, రాజశక్తి, యుద్ధసామగ్రి మొదలైన ఉపాయములు సంపూర్ణముగా నుండెనో దానికే పరాజయము తటస్థించినది, మఱి ఏ పక్షమునకీ సకలోపాయములును అసలే శూన్యమో దానికే జయము చేకూరినది. ఇట్టి ఫల వైపరీత్య మేల కలుగుచున్నది? 'యతో ధర్మ స్తతో జయః'. కాని ధర్మము వెనుక శక్తి యుండవలయును. లేదేని అధర్మమున కభ్యుత్థానమును ధర్మమునకు గ్లానియును స్థిరపడిపోవును. కారణము వినా కార్యము జరుగదు. జయ కారణము శక్తి. ఏ శక్తివలన దుర్బలపక్షమునకు జయము కల్గుచున్నది? మఱియు ప్రబలపక్షముయొక్క శక్తి పరాజితమై నశించిపోవుచున్నది? ఐతిహాసికదృష్టాంతముల నన్నింటిని మనము పరీక్షించినచో, ఆధ్యాత్మికశక్తి యొక్క బలముచే ఈ అఘటనాఘటనము జరుగుచున్నది, ఆధ్యాత్మికశక్తియే బాహుబలమును తుచ్ఛముచేసివైచి ఈ జగము భగవంతుని రాజ్య మనియు అంధమైన స్థూల ప్రకృతియొక్క లీలాక్షేత్రము కాదనియు మానవజాతికి

తెలుపుచున్నది, అని మనము గ్రహింపఁగలము. విశుద్ధ మైన ఆత్మయే శక్తియొక్క ఉత్సము. ఏ ఆద్యప్రకృతి గగనమందు కోటానకోట్ల సూర్యులను గిరగిర త్రిప్పు చున్నదో, అంగుళిస్పర్శమాత్రముచే పృథివి నల్లల్లాడించి మానవసృష్టమైన సౌభాగ్యమును సకలమును చిహ్న లేకుండ ధ్వంస మొనర్పఁగలదో, ఆ ఆద్యప్రకృతి విశుద్ధ మైన ఆత్మ కధీనము. ఆ ప్రకృతి అసాధ్యమును సాధ్య మొనరించును; మూఁగను మాటాడఁజేయును, కుంటికి కొండలు దాటఁగల సామర్థ్యము నిచ్చును. జగమంతయు ఆశక్తియొక్క సృష్టి. ఎవరియం దాధ్యాత్మిక బలము వికసించునో, వారికి జయసామగ్రి సకలమును తనంతట తానే ఉత్పన్న మగును; అభ్యంతరములును ఆటంకములును తమంతట తొలఁగి అనుకూలదశను రావించును, కార్యము సాధించు దక్షత తనంతట ఉప్పతిలి తేజోవేగముల నలవరించుకొనును. 'యూరపు' నేఁడు ఈ Soul-forceను లేక ఆధ్యాత్మిక శక్తిని తెలిసికొనుచున్నది; ఇంకను దాని యందు సంపూర్ణవిశ్వాసము కుదురలేదు; దాని నాధారము చేసికొని కార్యము నాచరించు ప్రవృత్తి ఉద్భ

వించుటలేదు. కాని భారతముయొక్క శిక్ష, సభ్యత, గౌరవము, బలము, మహత్త్వము, ఈ అన్నిటికిని మూల మందాధ్యాత్మికశక్తి. ఎన్నిమాఱులు భారత జాతియొక్క వినాశకాల మాసన్నమైనదని ఎల్లరికిని తోఁచు స్థితి ఏర్పడెనో, అన్నిమాఱులును ఆధ్యాత్మిక బలము తన దాఁగియున్న ఉత్సమునుండి తీవ్రస్రోత ముతో ప్రవహించి, ముమూర్షువైన భారతమును పున రుజ్జీవిత మొనర్చెను, ఆవశ్యకమైన సకలశక్తులను సృష్టించి యిచ్చెను. ఇప్పుడును ఆ ఉత్సము వట్టిపోలేదు. నేఁడును మృత్యుంజయ మైన ఆశక్తియొక్క అద్భుతక్రీడ విలసిల్లు చున్నది.

కాని స్థూలజగతియందలి ఏ శక్తియొక్క వికాస మైనను కాలముపై ఆధారపడియుండును. ఉన్న పరిస్థితుల కుపయుక్తమైనచందము ననుసరించుచు, సముద్రముయొక్క ఆటుపోటుసరణిగా క్షీణించుచు వృద్ధిపొందుచు, కడకు సంపూర్ణముగా కార్యకారియగును. మన విషయమునను అదియే జరుగుచున్నది. ఇపుడు సంపూర్ణముగా ఆటు;

పోటుసమయమునకై నిరీక్షించుచు నిలువఁబడియున్నాము. మహాపురుషుల తపస్య, స్వార్థత్యాగుల కష్టస్వీకారము, సాహసవంతుల ఆత్మవిసర్జనము, యోగుల యోగశక్తి, జ్ఞానుల జ్ఞానసంచారము, సాధువుల విశుద్ధి ఇవన్నియు ఆధ్యాత్మికబలమునకు జన్మస్థానములు. ఒకమారీ సకల విధమైన పుణ్యమును భారతమును సంజీవనీసుధయందు ముంచియెత్తి మృతజాతిని సజీవమును బలిష్ఠమును తేజస్వంతమును చేసి ఉద్ధరించెను. తనయందు తానింతదనుక నిరుద్ధమయి యున్న ఆ తపోబలము, మరల అదమ్యము నజేయమునై బయల్పడుట కుపక్రమించుచున్నది. కొన్ని సంవత్సరముల పీడనము, దౌర్బల్యము, పరాజయము వీని ఫలితముగా భారతీయులు తమ అంతరమందే శక్తియొక్క ఉత్సము నన్వేషించుట నేర్చుకొనుచున్నారు. ఈ శక్తి ఉపన్యాసములవలన కలుగు ఉత్తేజనము కాదు. మ్లేచ్ఛులిచ్చిన విద్య కాదు. సభాసమితులయందు ఆవేశమును సంచరింపఁజేయు శక్తి కాదు. వార్తాపత్రికల క్షణిక ప్రేరణ కాదు. తమఅంతరమున,ఆత్మయొక్క విశాలనీరవతయందు,భగవంతునియొక్కయు జీవునియొక్కయు సంయో

గముచే ఏశక్తి, గభీరము, అవిచాల్యము, అభ్రాంతము, విశుద్ధము, సుఖదుఃఖముల జయించినట్టిది, పాపపుణ్యముల నతిక్రమించినట్టిది ఆవిర్భూత మగునో; ఏది మహాసృష్టి కారిణి, మహాప్రళయంకరి, మహాస్థితిశాలిని; మఱి ఏది జ్ఞానదాయినియగు మహాసరస్వతి, ఐశ్వర్యదాయిని యగు మహాలక్ష్మి, శక్తిదాయిని యగు మహాకాళి; తేజః సహస్రముల ఏకరాశియైన ఆ చండి తా నావిర్భవించి, భారతముయొక్కయు భూమియొక్కయు కల్యాణమునకై పూనఁగలదు. భారతముయొక్క స్వాతంత్ర్యము గౌణోద్దేశ్యము మాత్రను; ముఖ్యోద్దేశ్యము భారతీయసభ్యత యొక్క శక్తిని ప్రదర్శించుట, జగమం దంతటను ఆ సభ్యతను విస్తరింపఁజేసి ఉచ్చపదవియందు నెలకొల్పుట. మనము పాశ్చాత్యసభ్యతయొక్క బలముచేఁగాని సభాసమితులయొక్క బలముచేఁగాని, ఉపన్యాసముల తీవ్రతచే లేక బాహుబలముచే స్వాతంత్ర్యమునో లేక స్వాయత్తశాసనమునో ఆర్జింపఁగల్గి యుంటిమేని, ఆ ముఖ్యోద్దేశ్యము సాధింపఁబడకుండెడిది. భారతీయ విజ్ఞానముయొక్క బలముచే, ఆధ్యాత్మికశక్తివలన సృజింపఁబడిన సూక్ష్మ స్థూ

లోపాయములచే స్వాతంత్ర్యము నార్జింప వలసియున్నది. కావుననే భగవంతుఁడు పాశ్చాత్యభావముచే ప్రేరితమైన మన ఆందోళనమును ధ్వంసముచేసి, బహిర్ముఖమైనశక్తిని అంతర్ముఖము కావించినాఁడు. బ్రహ్మబాంధవోపాధ్యాయుఁడు దివ్యచక్షువుతో దేనినిచూచెనో, చూచి 'శక్తి నంతర్ముఖముచేయుఁడు'అని మాటిమాటికిని ఏ ఆదేశమును పల్కెనో, పల్కినప్పటికిని దేనిని కాలదోషముచే ఎవరును శిరసావహింపలేకపోయిరో మఱియు తానే చేయలేక పోయెనో, దానినే భగవంతుఁడు నేఁడు ఘటింపఁజేయుచున్నాఁడు: భారతముయొక్క శక్తి అంతర్ముఖ మగుచున్నది. మరల నెపుడు బహిర్ముఖ మగునో ఇఁక నాప్రవాహము వెనుకకు మరలదు. ఎవరును దాని నడ్డగింపఁజాలరు. త్రిలోకపావనియగు ఆ గంగ భారతమును ముంచివైచి, పృథివిని ముంచివైచి, తన అమృతస్పర్శచే జగతికి నూతన యౌవనమును గైకొని రాఁగలదు.

---

# ప్రాచ్య పాశ్చాత్యములు

మన దేశమునకును యూరోపునకును ముఖ్యభేద మిది: మన జీవన మంతర్ముఖము, యూరోపుయొక్క జీవనము బహిర్ముఖము. మనము భావము నాశ్రయించి పాప పుణ్యముల విచారింతుము. యూరోపు కర్మ నాశ్రయించి పాపపుణ్యముల విచారించును. మనము భగవంతుని అంతర్యామిగా ఆత్మస్థితునిగా గ్రహించి అంతరమునం దాతని వెదకుదుము. యూరోపు భగవంతుని జగత్ప్రభువుగా గ్రహించి వెలుపల నాతని వీక్షించి పూజించును. యూరోపుయొక్క స్వర్గము స్థూలజగమందు. పృథివి యొక్క ఐశ్వర్యము, సౌందర్యము, భోగము, విలాసము ఇవన్నియు వారి కాదరణీయములు, అన్వేషణీయములు. వేఱొక స్వర్గమును వారు కల్పించినను ఈ నేలపైని ఐశ్వర్య సౌందర్యముల యొక్కయు భోగవిలాసముల యొక్కయు

ప్రతికృతియే అది. వారల భగవంతుఁడు మన యింద్రునికి సాటి: లౌకిక ప్రభువు చందమున రత్నమయ సింహాసనముపై గూర్చుండి వేనవేల వందిమాగధుల కైవారములచే ఉప్పొంగుచు విశ్వసామ్రాజ్యమును పరిపాలించును. మన శివుఁడు పరమేశ్వరుఁడు; అయ్యును భిక్షుకుఁడు, ఉన్మాది, "భోలానాథుఁడు".* మనకృష్ణుఁడు బాలుఁడు, హాస్యప్రియుఁడు, విలాసి, ప్రేమమయుఁడు. క్రీడించుట ఆతనిధర్మము. యూరోపుయొక్క భగవంతుఁడు ఎప్పుడును నవ్వఁడు, క్రీడింపఁడు. అట్లుచేసినచో ఆతని గౌరవమునకు భంగము కలుగును, ఆతని ఈశ్వరత్వమిఁక నిలువదు. పైఁజెప్పిన బహిర్ముఖభావమే దీనికి కారణము—ఐశ్వర్యమునకేవి చిహ్నములో అవియే వారల దృష్టియందు ఐశ్వర్యమునకాధారము. చిహ్నములు కనపడవేని వారు వస్తువును కనుఁగొనలేరు. వారలకు దివ్యచక్షువు లేదు, సూక్ష్మదృష్టి లేదు, సర్వమును స్థూలము. మన శివుఁడు భిక్షుకుఁడు; కాని త్రిలోక

---

* "మైమఅపుసామి"—అంతర్నివిష్టచైతన్యుఁడైన జడమూర్తి—స్థాణుఁడు. అనువాదకుఁడు.

మందలి సకలధనమును ఐశ్వర్యమును ఇంచుకలో సాధకు
నకు దానమిచ్చును. అతఁడు "భోలానాథుఁడు;" కాని
జ్ఞానులకు చేరరాని జ్ఞానము అతని సహజసంపత్తి. ప్రేమ
మయుఁడును, విలాసియు అగు మన శ్యామసుందరుఁడు
కురుక్షేత్రమునకు నాయకుఁడు, జగమునకు పాలకుఁడు,
బ్రహ్మాండమున కంతకును నెచ్చెలి, ప్రియుఁడు. భారత
దేశముయొక్క మహాజ్ఞానము, తీక్ష్ణమైన సూక్ష్మదృష్టి,
మఱియు అప్రతిహతమైన దివ్యచక్షువు స్థూలములైన
ఆవరణములను భేదించుకొనిపోయి, ఆత్మయందలి భావ
మును, అసలైన సత్యమును, లో నిలిచిన గూఢతత్త్వ
మును బయల్పడఁజేయును.

*
* *

పాప పుణ్యముల సంబంధమునను ఈ చందమే
గోచరించును. మన మంతరమందలి భావమును గమ
నింతుము. నిందపాలైన కర్మయందు పవిత్రభావమును,
వెలుపలకు పుణ్యరూపమునఁ గాన్పించు కర్మయందు పాపిష్ఠ
మైన స్వార్థమును దాఁగియుండవచ్చును. పాప పుణ్య

ములును సుఖదుఃఖములును మనోధర్మములు. కర్మ ఆవరణము మాత్రము. సామాజిక నియతికొఱకై మనము బాహ్య పాప పుణ్యములను కర్మకు ప్రమాణముగా మన్నింతుము; కాని అంతరంగమునందలి భావమునే ఆదరింపవలయును, అని మన మెఱుఁగుదుము. సన్యాసి ఎవ్వఁడాచార విచారములను,కర్తవ్య అకర్తవ్యములను, పాప పుణ్యములను దాటి, "బాలోన్మత్త పిశాచముల" విధమున విహరించునో, సర్వధర్మత్యాగియగు నాపురుషుని శ్రేష్ఠుఁడని మన మందుము. ఈ తత్త్వమును గ్రహించుటకు పాశ్చాత్యబుద్ధి చాలదు. ఎవఁడు జడునివలె ప్రవర్తించునో అతఁడు జడుఁడనియే తలపోయును. ఉన్మత్తుని విధమున ఎవఁడు ప్రవర్తించునో అతఁడు మెదడు చెడినవాఁడనియు, ఎవఁడు పిశాచమువలె ప్రవర్తించునో అతఁడు హేయభావాస్పదమైన అనాచారి పిశాచమనియు గ్రహించును. ఏలన వారలకు సూక్ష్మదృష్టి లేదు. వారంతరంగమందలి భావమును చూడఁజాలరు.

*

* *

ఈ చందమున బాహ్యదృష్టికి వశవర్తులైన యూరోపీయ పండితులు భారతమందు ప్రజాతంత్రమే నాఁడును లేదని పల్కుదురు. ప్రజాతంత్రమును సూచించెడు పదము సంస్కృతభాషయందు దొరకుట లేదనియు, నేటి పార్లమెంటువంటి ఏశాసనసభయు పూర్వము కనఁబడుట లేదనియు, కావున ప్రజాతంత్రముయొక్క ఈ బాహ్య చిహ్నములు లేమిచే ప్రజాతంత్రమే లేదనియు వారి నిగమనము. మనము పాశ్చాత్యుల ఈ యుక్తిని యథార్థమని గ్రహించుచు వచ్చుచున్నాము. మన ప్రాచీన ఆర్య రాజ్యమందు ప్రజాతంత్రము లేకపోలేదు. ప్రజాతంత్రముయొక్క బాహ్యోపకరణములు అంత సంపూర్ణముగా లేనిమాట నిజమే. కాని ప్రజాతంత్రభావము మన సకల సమాజముయొక్కయు పరిపాలనా తంత్రముయొక్కయు అంతరంగమున వ్యాపించినదై, ప్రజాసుఖమును దేశోన్నతిని రక్షించినదయ్యెను. మొదటి విషయము: ప్రతిగ్రామమందును సంపూర్ణమైన ప్రజాతంత్ర ముండెడిది. గ్రామ జనులు కూడి, సర్వసాధారణులైన ఎల్లరి అభిప్రాయముల ననుసరించి, వృద్ధులును నాయకస్థానమం దున్నవారలును

అగు పురుషుల అనుజ్ఞతో గ్రామమునకును సమాజమునకును వలసిన యేర్పాటులు కావించెడివారు. ఈ గ్రామ ప్రజాతంత్రము ముసల్మానుల అమలునందును దెబ్బతినక నిలిచియుండెను. బ్రిటిషుపరిపాలనా తంత్రముయొక్క నిష్పేషణముచే మొన్న మొన్న నశించిపోయెను. రెండవ విషయము: చిన్న చిన్న ప్రతిరాజ్యమందును ఎచట సాధారణప్రజ నొకచోట సమావేశపరచుటకు వీలుండెనో అచట, ప్రజాసమావేశములు జరుగుచుండుట ఆచారముగా ఉండెను; బౌద్ధసాహిత్యమందును, గ్రీకు ఇతిహాస మందును, మహాభారతమందును ఈ విషయమునకు ప్రమాణము లనేకములు లభింపఁగలవు. మూఁడవ విషయము: కడు పెద్దరాజ్యము లందు ఎచట ఈ విధమైన బాహ్యోపకరణము లుండుట సంభవము కాదో అచటను, ప్రజాతంత్ర భావమే రాజతంత్రమును నడిపెడిది. శాసన సంస్థాపక సమితి ప్రజలకు లేకుండెను. కాని రాజునకైనను శాసనమును సృజించుటకుఁగాని అమలులోనున్న శాసనమును మార్చుటకుఁగాని లేశమాత్రమును అధికారము లేకుండెడిది. ప్రజలు ఏ ఆచార వ్యవహారములను, ఏ నియమ

సంప్రదాయములను, ఏ మామూలులను, ఏకట్టుబాట్లను మన్నించుచు వచ్చిరో, వానిని రక్షించుటయే రాజు యొక్క కర్తవ్యము. బ్రాహ్మణులు నేటి జడ్జీ వకీళ్లవలె ప్రజలచే అనుష్ఠింపఁబడు ఆ సకలనియమములను రాజునకు తెలిపెడివారు, సంశయము లేర్పడినపట్టున నిర్ణయములు చేసెడివారు, కాలక్రమమున చూపట్టు మార్పులను శాస్త్రమునందు లిఖితరూపమున నిలిపెడివారు. పరిపాలన యొక్క భారము రాజుదే ఐయుండెను. కాని ఆ అధికారము శాసనముయొక్క కఠిన శృంఖలచే కట్టుపడి యుండెను. అదిగాక రాజు ప్రజచే అనుమోదింపఁబడిన కార్యములనే చేయవలయును, ప్రజల కసంతృప్తికలిగించు కార్యముల నెన్నఁడును చేయరాదు, అను రాజతంత్రము యొక్క నియమమును ఎల్లరును మన్నించుచుండిరి. రాజు దీని నుల్లంఘించినచో, ప్రజకు రాజును పాటింపవలసిన బాధ్యత తొలఁగిపోయెడిది.

*

* *

ప్రాచ్య పాశ్చాత్యముల ఏకీకరణమే ఈ యుగము

యొక్క ధర్మము, కాని ఈ ఏకీకరణమునందు పాశ్చాత్య మును పునాదిగాఁగాని లేక ముఖ్యాంగముగాఁగాని చేసితిమేని మిక్కిలి విషమ భ్రమలో పడినవార మగుదుము. ప్రాచ్యమే పునాది. ప్రాచ్యమే ముఖ్యాంగము. బహిర్జగము అంతర్జగతియందు ప్రతిష్ఠింపఁబడియున్నది. అంతర్జగము బహిర్జగతియందు ప్రతిష్ఠింపఁబడిలేదు. భావము, శ్రద్ధ, ఇవియే శక్తియొక్కయు కర్మయొక్కయు ఉత్సములు. భావ శ్రద్ధలను మనము కాపాడవలయును; కాని మనశక్తిని కార్యనిర్వాహణయొక్క విధానములందును కర్మయొక్క బాహ్యకారమందును ఉపకరణములందును ఆసక్తము కానీయరాదు. పాశ్చాత్యులు ప్రజాతంత్రముయొక్క వెలుపలి ఆకృతియందును ఉపకరణ సామగ్రియందును మిగుల వ్యగ్రత చూపుచున్నారు. భావమును పరిస్ఫుటము చేయుకొఱకే వెలుపలి ఆకృతియు ఉపకరణ సామగ్రియు. భావము రూపమును నిర్మించును. శ్రద్ధ ఉపకరణసామగ్రిని సృష్టించును. కాని ఆకృత్యుపకరణముల యందు అత్యాసక్తులగుటచే భావమును శ్రద్ధయు బాహ్యరూపాడంబరమునందు కృశించిపోవుచున్నవని పాశ్చా

త్యులు గమనింపలేకున్నారు. నేఁడు ప్రాచ్య దేశములందు ప్రజాతంత్రలక్ష్యములైన భావశ్రద్ధలు తీవ్రవేగముతో పరిస్ఫుటములై వలసిన బాహ్యోపకరణములను సృష్టించు చున్నవి, బాహ్యరూపములను నిర్మించుచున్నవి. కాని పాశ్చాత్యదేశములం దా భావము మ్లానమగుచున్నది, ఆ శ్రద్ధ క్షీణించుచున్నది. ప్రాచ్యము ప్రభాతో న్ముఖము—వెలుఁగు దిక్కునకై పరుగిడుచున్నది. పాశ్చా త్యము నిశోన్ముఖము—చీకటిదిక్కునకు తిరిగిపోవుచున్నది.

*
* *

దీనికి కారణము, వెలుపలి ఆకృతియందును ఉప కరణములందును అధికాసక్తి ఫలితముగా ప్రజాతంత్రము నకు కలిగిన చెడు పరిణామము. ప్రజాతంత్రమునకు మిక్కిలి అనుకూలమైన పరిపాలనావిధానమును సృష్టించి, తనతో పోలిన స్వాధీనదేశము జగతియందు వేఱొకటి లేదని ఇన్నాళ్లనుండియు అమెరికా గర్వపడుచుండెను. కాని యథార్థమునకు ప్రెసిడెంటును నిర్వాహకవర్గమువారును కాంగ్రెసుసహాయముతో స్వేచ్ఛగా పరిపాలించుచున్నారు,

ధనికుల అన్యాయమునకు, అవిచారమునకు,సర్వగ్రాసియగు లోభమునకును ఆశ్రయ మిచ్చుచున్నారు. తాము తమ అధికారముయొక్క అపవ్యవహారముచే ధనికు లగుచున్నారు. ప్రతినిధుల నెన్నుకొను ఒక్కసమయమున మాత్రము ప్రజ స్వాధీనులు. కాని అప్పుడును ధనికులు పుష్కలముగా ధనము ప్రవహింపఁజేసి తమ అధికారమును భద్రముగా కాపాడుకొందురు; పదపడి ప్రజాప్రతినిధులను కొనివైచి స్వేచ్ఛగా ధనశోషణము గావింతురు, ఏలుబడిని చలాయింతురు. ఫ్రాన్సుదేశము స్వాధీనతకును ప్రజాతంత్రమునకును జన్మభూమి. కాని ప్రజేచ్ఛానుసారమున పరిపాలనాకార్యమును నిర్వహించు ప్రత్యేక యంత్రస్వరూపముగా ఏ కర్మనిర్వాహకవర్గమును పోలీసు బలగమును సృష్టింపఁబడినవో, వారే ఇప్పుడు అపరిమిత సంఖ్యాకులును క్షుద్రులును అగు నిరంకుశ ప్రభువులై కూర్చుండుటచే ప్రజ వారి వెఱపుతో తల్లడిల్లుచున్నది. ఇంగ్లండునందు ఈ తీరు సంకటము కలుగ లేదనుట నిజమే. కాని ప్రజాతంత్రమునకు కొన్ని ఇతరములైన ఆపద లచ్చట తలచూపుచున్నవి. అర్ధ శిక్షితమును,

చంచలమతియు ఐన ప్రజయొక్క ప్రతి మతపరివర్తనము తోడను పరిపాలనాకార్యమును రాజనీతియు సంక్షోభము చెందుటచే, బ్రిటిషుజాతి తనపురాతన రాజనీతి కౌశల్య మును పోఁగొట్టుకొని దేశమునకు లోపలను వెలుపలను ఆపదకు లోనగుచున్నది. శాసనకర్తలు కర్తవ్యభావము లేని వారై, తమస్వార్థమును పలుకుబడిని కాపాడుకొనుటకై, ఎన్నిక అధికారము కల ప్రజను లోభపెట్టియు, భయపెట్టి యు, తప్పుబోధించియు బ్రిటిషుజాతియొక్క బుద్ధిని పెడదా రిని బట్టించుచున్నారు, వారిమతియొక్క అస్థిరత్వచాంచల్య ములను వృద్ధిచేయుచున్నారు. ఒకవైపున ఈ అన్నిహేతు వులచే ప్రజాతంత్రవాదమే తప్పని, స్వాధీనతకు విరుద్ధ ముగా కొందఱు నడుముకట్టుచున్నారు. ఇంకొకవైపున అరాజకవాదులయు (Anarchists), సామ్యవాదులయు (Socialists), విప్లవకారులయు (Revolutionists) సంఖ్య పెరుగుచున్నది. ఈ రెండుపక్షములకును సంఘర్షము ఇంగ్లండులో రాజనీతిక్షేత్రమునందు జరుగుచున్నది; అమెరికాలో పాటకపుజనమునకును ధనికులకును గల విరోధమునందు జరుగుచున్నది; జర్మనీలో మతముల

సృష్టియందు; ఫ్రాన్సులో నౌ సైన్యమునకును ఇతర సైన్యమునకునుగల స్పర్థయందు; రష్యాలో పోలీసులకును హత్యాకారులకును ఏర్పడిన సంగ్రామమందు;—అన్ని చోట్లను గగ్గోలు, అవ్యవస్థ, అశాంతి.

బహిర్ముఖమైన దృష్టికి ఇట్టి పరిణామ మనివార్యము. రాజసిక తేజముచే కొన్నాళ్లసురులు గొప్పవారును శ్రీసంపన్నులును అజేయులును అగుదురు; పదపడి లోపల నున్న దోషములు బయల్పడఁగా అంతయు భగ్నమై అణిపడి లగును. భావము, శ్రద్ధ, జ్ఞానయుక్తమైనకర్మ, ఆసక్తివర్జితమైనకర్మ, ఇవి ఏదేశముయొక్క శిక్షణమునకు మూలమంత్రమో, ఆదేశమునందే ఆంతరము బాహిరము, ప్రాచ్యము పాశ్చాత్యము, ఇవన్నియు ఏకీకరింపఁబడి, సామాజికమును, ఆర్థికమును, రాజకీయమును అగు సకల ప్రశ్నలకును తృప్తికరమైన సమాధానము కార్యరూప మున ఏర్పడఁగలదు. కాని పాశ్చాత్య జ్ఞాన శిక్షణములకు వశవర్తులమై ఆ సమాధానమును గావింపలేము. ప్రాచ్య ముపై నిలుచుండి పాశ్చాత్యమును స్వాయత్తము చేసి

కొనవలయును. అంతరమున ప్రతిష్ఠ, బాహిరమున ప్రకాశము. భావమునకు పాశ్చాత్యులే ఉపకరణముల నేర్పఱచుకొనిరో వానినే మన మవలంబించినచో ఆపదకు లోనగుదుము; నిజస్వభావమునకును ప్రాచ్యబుద్ధికిని అనుకూలమైన ఉపకరణములను సృష్టించుకొనవలయును.

---

# భ్రాతృత్వము

ఆధునిక సభ్యతయొక్క మూఁడు ఆదర్శములు లేక చరమోద్దేశ్యములు ఫ్రాన్సురాష్ట్రవిప్లవ సమయము నందు ప్రచారము చేయఁబడినవి. మన భాషయందు సాధారణముగా ఈ మూఁడు తత్త్వములును స్వాధీనత, సామ్యము, మైత్రి యని వ్యవహరింపఁబడుచున్నవి. కాని పాశ్చాత్య భాషయందు Fraternity అని దేని నందురో అది మైత్రి కాదు. మైత్రి మనస్సుయొక్క భావము. ఎవఁడు సర్వభూతములయొక్క కల్యాణమును కాక్షించునో, ఎవ్వరికిని అనిష్టము చేయఁడో, దయావంతుఁడును అహింసాపరాయణుఁడును సర్వభూతహితరతుఁడును అగు ఆ పురుషుని మిత్రుఁడందురు. మైత్రి ఆతని మనస్సుయొక్క భావము. ఈ విధమైన భావము వ్యక్తియొక్క మానసిక సంపత్తి. అది వ్యక్తియొక్క జీవనమును కర్మను నియ

మించుటకు సమర్థ మగును. ఈ భావము రాజకీయమైన లేక సామాజికమైన నియమ శృంఖలయందు ముఖ్యబంధన మగుట అసాధ్యము. ఫరాసు రాష్ట్ర విప్లవముయొక్క మూఁడు తత్త్వములును వ్యక్తిగతజీవనముయొక్క నైతిక నియమములు కావు, సమాజముయొక్కయు దేశముయొక్కయు వ్యవస్థను నూతనముగా నిర్మించుట కుపయోగపడు సూత్రత్రయము, సమాజముయొక్కయు దేశముయొక్కయు బహిఃశరీరమునందు వ్యక్తము కాఁజూచు స్వాభావిక మూలధర్మములు. Fraternity అను పదముయొక్క అర్థము భ్రాతృత్వము.

ఫరాసు విప్లవకారులు రాజకీయమును సామాజికమును అగు స్వాధీనతాసామ్యముల లబ్ధికై చాల ఉద్యోగపడిరి. కాని భ్రాతృత్వముపై దృఢలక్ష్యము వారికి లేకుండెను. భ్రాతృత్వముయొక్క అభావము ఫరాసు రాష్ట్ర విప్లవముయొక్క అసంపూర్ణతకు కారణము. అపూర్వమైన ఆ ఉత్థానమునందు రాజకీయమును సామాజికమును అగు స్వాధీనత యారోపునందు ప్రతిష్ఠింపఁబడెను; రాజకీయ

మగు సామ్యముకూడ కొలదిపాటిగా కొన్ని దేశము లందు పరిపాలనాతంత్రములను శాసనపద్ధతులను నియ మించెను. కాని భ్రాతృత్వము లేదేని సామాజికసామ్య మసంభవము, భ్రాతృత్వముయొక్క అభావముచే యూరోపు సామాజిక సామ్యవిషయమున భంగపడెను. ఈ మూలతత్త్వముల మూఁడింటియు సంపూర్ణవికాసము వీని అన్యోన్యవికాసకత్వముపై ఆధారపడియున్నది. సా మ్యము స్వాధీనత కాధారము; సామ్యము లేదేని స్వాధీనత నెలకొల్పఁబడఁజాలదు. భ్రాతృత్వము సామ్యమున కాధా రము; భ్రాతృత్వము లేదేని సామ్యము నెలకొల్పఁబడఁ జాలదు. ఇఁక భ్రాతృభావము కలప్పుడే భ్రాతృత్వము. యూరోపునందు భ్రాతృభావము లేదు; కావుననే యూరో పున సామ్యస్వాధీనతలు కలుషితములు, అప్రతిష్ఠితములు, అసంపూర్ణములు; కావుననే యూరోపునందు సంక్షోభ విప్లవములు నిత్యస్థితిగా నిలువఁబడినవి. ఈ సంక్షోభ విప్లవములనే యూరోపు గర్వముతో Progress లేక ఉన్నతి అని చెప్పుచున్నది.

యూరోపునందు ఏమాత్రము భ్రాతృభావము కలదో అది దేశమును పురస్కరించుకొని. ఒకే దేశమందలి ప్రజయొక్క మంచిచెబ్బర లొక్కటి, ఏకతచే జాతీయ స్వాధీనత నిరాపదముగా రక్షింపఁబడును—అను జ్ఞానమే యూరోపుయొక్క ఏకత్వమునకు హేతువు. దీనికి విరోధముగా వేఱొకజ్ఞానము తలయెత్తినది. మన మందఱమును మానవులము. మానవులందఱును ఏకమగుట న్యాయ్యము. మానవునకును మానవునకును భేదము అజ్ఞానమువలన కలుగుచున్నది, అనిష్టమును కలిగించుచున్నది. జాతీయత భేదమునకు కారణము. జాతీయత అజ్ఞానమువలన కలుగుచున్నది, అనిష్టములను కలిగించుచున్నది. కావుననే జాతీయతను వర్జించి మానవజాతియొక్క ఏకత్వమును ప్రతిష్ఠింపవలయును. ముఖ్యముగా ఏ ఫరాసుదేశమున స్వాధీనతా సామ్య భ్రాతృత్వములు అను మహాదర్శములు మొదట ప్రచారముచేయఁబడెనో, భావప్రవణమైన ఆదేశమందే పరస్పర విరోధకములైన ఈ రెండు జ్ఞానములకును సంఘర్షణ జరుగుచున్నది. కాని యథార్థమున కీ రెండు జ్ఞానములును, భావములును ఒండొండ విరోధించునవి

కావు. జాతీయతయు సత్యము, మానవజాతియొక్క ఏకతయు సత్యము. ఈ రెండు సత్యములయొక్క మేళవింపు లేక సామంజస్యమునందే మానవజాతియొక్క కల్యాణము. మనబుద్ధి ఈ సామంజస్యమును సాధించుట కసమర్థమగునేని, అవిరోధితత్త్వములయొక్క విరోధమం దాసక్తమగునేని, ఆబుద్ధిని భ్రాంతమును రాజసికమును అగుబుద్ధి అని చెప్పవలయును.

సామ్యశూన్యమైన రాజకీయ సామాజిక స్వాధీనతయెడ మక్కువవీడి, యూరోపు నేడు 'సోషలిజమ్' వైపునకు పరుగిడుచున్నది. ఇది రెండు తెగ లయినది: ఒక తెగ అరాజకవాదులు (Anarchists), రెండవ తెగ సామ్యవాదులు (Socialists). 'అనార్కిస్టులు' లేక అరాజకవాదు లిట్లందురు. ఈ రాజకీయస్వాధీనత మాయ. ప్రభుత్వమను పేరిట గొప్పవారలు తమ అన్యాయాచరణ కొక యంత్రమును నెలకొల్పి, తద్ద్వారమున, రాజకీయ స్వాధీనతను కాపాడుమిషతో, వ్యక్తిగతస్వాధీనత నణగద్రొక్కుటయే ఈ మాయయొక్క లక్షణము. కావున సకలవిధమైన

ప్రభుత్వమును ఎత్తివైచి, యథార్థమైన స్వాధీనతను స్థాపింపవలయును. ప్రభుత్వము లేనిపక్షమున స్వాధీనతాసామ్యముల నెవరు రక్షింతురు, బలవంతుల దౌర్జన్యము నెవరు వారింతురు?—అను ఆపత్తికి అరాజకవాదుల సమాధానమిది: విద్యను విస్తరింపఁజేసి సంపూర్ణమైన జ్ఞానమును భ్రాతృభావమును విస్తరింపఁజేయవలయును; ఈ జ్ఞానమును భ్రాతృభావమును స్వాధీనతాసామ్యముల రక్షించును; ఎవరైనను భ్రాతృభావము నుల్లంఘించి దౌర్జన్యము చేసినచో, అతని కెవ్వఁడేని మృత్యుదండమును విధింపవచ్చును. సామ్యవాది ఈ మాట చెప్పఁడు. అతఁ డిట్లనును: ప్రభుత్వము నుండనిమ్ము, ప్రభుత్వమునకు ప్రయోజన మున్నది. కాని సమాజమును పరిపాలనా విధానమును సంపూర్ణసామ్యముపై నెలకొల్పవలయును; ఇప్పుడు సమాజమందును పరిపాలనా విధానమందును ఏదోషములు కలవో వానిని సంస్కరింపవలయును; అట్లైనచో మానవజాతి సంపూర్ణమైన సుఖమునందును స్వాధీనతయందును భ్రాతృభావమునందును ఓలలాడును. అందు కొఱకై సామ్యవాది సమాజమును ఏకము చేయఁగోరును.

ఒకరికిఁజెందిన సొత్తులేకుండి సొత్తంతయు సమాజమునకే చెందుపక్షమున—అనఁగా ఏకభాండమున భుజించు కుటుంబముయొక్క సొత్తు ఏ ఒక్కనికిని చెందక కుటుంబమునకే చెందునో, మఱియు కుటుంబము దేహమన్నచో వ్యక్తి ఆదేహముయొక్క అవయవమగునో, అట్లే సమాజమును ఐనచో, ఇఁక సమాజమునందు భేదము లుండవు, సమాజమంతయు ఒక్కటే యగును.

భ్రాతృభావము నెలకొల్పఁబడుటకు పూర్వమే ప్రభుత్వమును ధ్వంసముచేయు ప్రయత్నము అరాజకవాదులతప్పు. సంపూర్ణభ్రాతృభావము నెలకొనుటకు చాల తడవున్నది. ఇంతలో పరిపాలనాతంత్రమును లేవనెత్తుట వలన కలుగు నిశ్చిత ఫలమేమన, ఘోరమైన అరాజకత యందు పశుభావము తన యేలుబడిని సాగించుట. ప్రభువు సమాజమునకు కేంద్రము, ప్రభుత్వతంత్రమును స్థాపించి మనుష్యుఁడు తన పశుభావమును దూరగించుటకు సమర్థుఁడగుచున్నాఁడు. సంపూర్ణ భ్రాతృభావము ఎప్పుడు స్థాపితమగునో, అప్పుడు భగవంతుఁడు పార్థివప్రతినిధి నొకని

నియోగింపక పృథివిపై తానే రాజ్యముచేసి ఎల్లరి యెడఁద లందును తన సింహాసనమును నిర్మించి కూర్చుండును; క్రైస్తవుల Reign of the Saints అనఁగా సాధుపురుషుల ఏలుబడి, లేక మన సత్యయుగము అప్పుడు స్థాపింపఁబడును. ఈస్థితి త్వరలో ప్రాప్తమగునంత ఉన్నతిని మానవజాతి ఇంకను చేరలేదు. ఈస్థితియందలి ఏ అంశము మాత్రమో ఉపలబ్ధమగుట సాధ్యపడును.

భ్రాతృభావముపై సామ్యమును నెలకొల్పక సామ్యముపై భ్రాతృత్వమును నెలకొల్పు ప్రయత్నమే సామ్యవాదియొక్క తప్పు. సామ్యవిహీనమైన భ్రాతృత్వము సాధ్యమగును; కాని భ్రాతృత్వహీనమైన సామ్యము నిలువనేరదు; మతభేదముచే, కలహముచే, అధికారము కొఱకైన అధికలాలసచే అది వినష్టమైపోవును. తొలుత సంపూర్ణభ్రాతృత్వము, పిదప సంపూర్ణసామ్యము.

భ్రాతృత్వము బహిఃస్థితి. ఎల్లరును భ్రాతృభావముతో మెలఁగుట, ఎల్లరికిని ఒక్కటే సొత్తు, ఒక్కటే

హితము, ఒక్కటే ప్రయత్న మేర్పడుట, దీనినే భాతృత్వ మందురు. బహిఃస్థితి ఆంతరమైన భావముపై ప్రతిష్ఠింపఁబడియుండును. భాతృప్రేమచే భాతృత్వము సజీవమును సత్యమును అగును. ఆ భాతృప్రేమకును ప్రతిష్ఠ లేక ఆధారము కావలయును. మన యొక్క తల్లి బిడ్డలము, దేశ సోదరులము అను భావ మొకవిధమైన భాతృప్రేమ కాధారము. ఈ భావము రాజకీయమగు ఏకతకు సాధకమగును; కాని సామాజికమైన ఏకత దీనిచే సాధింపఁబడదు. దానికై ఇంకను లోనికి ప్రవేశింపవలసి యుండును. ఏవిధమున తమతల్లులను గడచిచని దేశసోదరు లెల్లరును దేశమాత నుపాసింతురో, ఆవిధముననే దేశ మును గడచిచని జగజ్జనని యొక్క ఉపలబ్ధిని పడయవల యును. ఖండశక్తిని దాటి సంపూర్ణశక్తియందు చొరవల యును. కాని భారతజనని ఉపాసనయందు శరీరజననిని గడచిచనియు ఆమెను విస్మరించుట లేదో, ఆవిధముననే జగజ్జనని ఉపాసనయందు భారతజననిని గడచిపోయియు ఆమెను విస్మరింపము. ఆమెయును కాళి, ఆమెయును తల్లి.

ధర్మమే భ్రాతృభావమునకు ప్రతిష్ఠ. సకలధర్మములును ఈ మాటచెప్పుచున్నవి: మన మందఱమును ఒక్కటియే; భేదము అజ్ఞానము వలన పుట్టుచున్నది, ద్వేషము వలన పుట్టుచున్నది. ప్రేమ సకలధర్మములకును మూలశిక్షణము. మన ధర్మముగూడ మనమెల్లరమును ఒక్కటే అనియు, భేదబుద్ధి అజ్ఞాన లక్షణమనియు, జ్ఞాని ఎల్లరను సమానదృష్టితో చూచుననియు, ఎల్లరియందును ఒకే ఆత్మను, సమభావమున నెలకొనియున్న ఒకే నారాయణుని, దర్శించుననియు చెప్పుచున్నది. భక్తిపూర్ణమైన ఈ సమత నుండియే విశ్వప్రేమ ముదయించుచున్నది. కాని ఈ జ్ఞానము మానవజాతియొక్క పరమగంతవ్యము; మనకడపటిదశయం దీ జ్ఞాన మెల్లరియందును వ్యాపించును. ఈలోపల దాని ఆంశికోపలబ్ధిని అంతరమందును బాహ్యమందును, కుటుంబమందును సమాజమందును, దేశమందును సర్వభూతములందును, సాధింపవలయును. కుటుంబము, కులము, దేశము, సంప్రదాయము మొదలైన వానిని సృష్టించి, శాస్త్రము, అనఁగా నియమము యొక్క బంధనముచే వానిని దృఢమొనర్చి, ఈ భ్రాతృత్వ

మునకు స్థాయియైన ఆధారమును నిర్మించుటకై మానవ జాతిచిరకాలమునుండియు శ్రమించుచున్నది. ఇంతవఱకును ఈ శ్రమ సఫలము కాలేదు. ప్రతిష్ఠకలదు; ఆధారముకలదు; కాని భ్రాతృత్వమునకు ప్రాణరక్షకమైన ఒకానొక అక్షయ శక్తి కావలయును; ఆశక్తివలననే ఆప్రతిష్ఠ బెసకనిదై, ఆ ఆధారము చిరస్థాయి, అనఁగా నిత్యనూతనమై యుండఁ గలదు. భగవంతుఁ డింతవఱకును ఆశక్తిని ప్రకాశము చేయలేదు. ఆతఁడు రాముఁడు, కృష్ణుఁడు, చైతన్యుఁడు, రామకృష్ణుఁడు అను రూపములం దవతరించి, మానవుని కఠోరమును, స్వార్థపూర్ణమును అగు హృదయమును ప్రేమ కుపయుక్తమైన పాత్రముగా మార్చుటకు యత్నించుచున్నాఁడు. ఆతఁడు తిరిగి యవతరించి, మానవ హృదయములలో చిరములైన ప్రేమానందములను సంచ రింపఁజేసియు స్థిరమొనర్చియు పృథివిని స్వర్గతుల్య మెన్నఁడుచేయునో ఆదిన మెప్పుడు రానున్నది?

---

# భారతీయ చిత్రవిద్య

మన ఈ భారతజనని జ్ఞాన-ధర్మ-సాహిత్య-శిల్పములకు తఱుగులేని గనియై యుండెనని పాశ్చాత్యులును ప్రాచ్యులును ఎల్లరును అంగీకరింపక తప్పదు. మన సాహిత్య శిల్పములు మిక్కిలి ఉచ్చశ్రేణికి చెందినను భారతీయచిత్రవిద్య అంత గొప్పదికాదనియు, కాకపోఁగా మిక్కిలి జఘన్యమును సౌందర్యహీనమును ఐ యుండెననియు ఇంతకు పూర్వము యూరోపునందలి అభిప్రాయము. మనమును పాశ్చాత్యజ్ఞానముతో జ్ఞానవంతులమై, కంటికి యూరోపు కంటిజోడు నమర్చుకొని భారతీయ చిత్రమును భారతీయస్థాపత్యమును చూచునప్పుడు మూతి విఱుచుకొనుచు మనబుద్ధికిఁ గల్గిన సంస్కారమును మన యభిరుచికిఁ గల్గిన సంమార్జనమును ప్రకటించెడివారము.

మన ధనికుల గృహములు గ్రీకు ప్రతిమలయు ఆంగ్లేయుల చిత్రములయు Cast-లతో లేక నిర్జీవానుకరణములతో నిండిపోయెను. సాధారణుల ఇంటిగోడలుకూడ జఘన్యము లైన తైలచిత్రములతో అలంకరింపఁబడుట ప్రారంభ మయ్యెను. ఏ భారతజాతియొక్క అభిరుచియు శిల్పచాతుర్య మును జగతియందు సాటిలేనిదై యుండెనో, వర్ణ-రూప-గ్రహణమందు ఏ భారతజాతియొక్క అభిరుచి స్వభావముగా నిర్దోషమైయుండెనో, అట్టిజాతియొక్క కన్నులు గ్రుడ్డివయ్యెను, బుద్ధి భావగ్రహణమం దసమర్థ మయ్యెను, అభిరుచి ఇటలీదేశపు కూలినాలిజనుల అభిరుచి కంటె అధమ మయ్యెను. రాజా రవివర్మ భారతదేశము యొక్క శ్రేష్ఠచిత్రకారుఁడని పేరు పొందుటకు సాధ్య మయ్యెను. రసజ్ఞులైన కొందఱి ఉద్యమముచే ప్రస్తుతము భారతీయుల కనులు విప్పుకొనుచున్నవి. తమ సామర్థ్య మును తమ ఐశ్వర్యమును గ్రహించుట కారంభించినారు. శ్రీయుత అవనీంద్రనాథ ఠాకూరు గారి అసాధారణ ప్రతిభయొక్క ప్రేరణచే అనుప్రాణితులైన కొందఱు యువకులు లుప్తమైపోయిన భారతీయ చిత్రవిద్యను మరల

నుద్ధరించుచున్నారు. వారల ప్రతిభాగుణముచే వంగ దేశమునందు నూతనయుగముయొక్క సూచనలు కాన్పించుచున్నవి. భారతీయు లిఁక ఆంగ్లేయుల కంటితో చూడక తమకంటితోనే చూడఁగలరనియు, పాశ్చాత్యుల అనుకరణమును పరిత్యజించియు ప్రాంజలమైన స్వబుద్ధినే ఆధారము చేసికొనియు మరల భారతముయొక్క సనాతన భావమును చిత్రార్పితమైన వర్ణరూపములందు వెల్లడింపఁగలరనియు మన మిపు డాశపడవచ్చును.

భారతీయ చిత్రవిద్యయెడ పాశ్చాత్యుల వైముఖ్యమునకు రెండుకారణములు కలవు. వా రి ట్లందురు: Nature లేక ప్రకృతి ననుకరించుట భారతీయచిత్రకారులకు చేతకాదు; సరిగా మనుష్యునివంటి మనుష్యుఁడు, గుర్రమువంటి గుర్రము, చెట్టువంటి చెట్టు వీనినిచిత్రింపక వీనివికృతమూర్తులను రచింతురు. వారికి Perspective లేదు. బొమ్మలు చదునుగాను అస్వాభావికముగాను గోచరించును. రెండవ ఆపత్తి ఇది: ఈ చిత్రము లన్నింటి

యందును సుందరభావముగాని సుందరరూపముగాని అత్యంతము శూన్యము. ఈ కడపటి ఆపత్తి ఇప్పుడిక యూరోపీయులనోట వినఁబడుటలేదు. మనపురాతన బుద్ధమూర్తుల సాటిలేని శాంతభావము, మనపురాతన దుర్గామూర్తియందలి అపార్థివ శక్తియొక్క ప్రకాశము, వీనిని జూచి యూరోపీయులు నేఁడు ప్రీతులును స్తంభితులును అగుచున్నారు. భారతీయచిత్రకారులు యూరోపీయుల Perspective ను ఎఱుఁగకపోవచ్చును; కాని భారతీయులకు ఏ Perspective యొక్క నియమములు కలవో అవి మిక్కిలి రమ్యమైనవి, సమగ్రమైనవి, అన్యోన్యసంగతమైనవి అని విదేశములందు శ్రేష్ఠవిమర్శకులుగా ఎవరు పేరుబడసినారో వారును ఇపు డంగీకరించుచున్నారు. భారతీయచిత్రకారులును ఇతరశిల్పులును సరిగా బాహ్యజగతియొక్క అనుకరణమును చేయరనుమాట వాస్తవము. కాని సామర్థ్యము లేమిచేకాదు. వారియుద్దేశ్యము, బాహ్యదృశ్యమును బాహ్యాకారమును గడచిచని, అంతఃస్థమైన భావమును సత్యమును ప్రకాశింపఁజేయుట.

బాహ్యాకృతి ఈ ఆంతర సత్యమున కావరణము, దాని ఛద్మవేషము. ఆ ఛద్మవేష సౌందర్యమునందు నిమగ్నులమై లోపల నేది దాఁగియున్నదో దానిని గ్రహించుటకు చాలకున్నాము. కావుననే భారతీయ చిత్రకారులు బుద్ధిపూర్వకముగా బాహ్యాకృతిని మార్చి, ఆంతర సత్యమును ప్రకాశింపఁజేయుట కుపయుక్తమైన విధమున దానిని రచించిరి. ఎంతచక్కనితీరున వారు ప్రతి అవయవమందును, నలువైపుల దృశ్యమందును, ఆసనమందును, వేషమునందును, మానస భావముయొక్క లేక బాహ్య ఘటనయొక్క అంతర్గతసత్యమును ప్రకాశింపఁజేసిరో, అది చూచినచో విస్మితులము కావలయును. ఇదియే భారతీయ చిత్రములయొక్క ప్రధానగుణము, చరమోత్కర్ష. పాశ్చాత్యులు బాహ్యముయొక్క మిథ్యానుభవమునందే ఆసక్తులు. వారు ఛాయకు భక్తులు. ప్రాచ్యము ఆంతరసత్యము నన్వేషించును. మనము వస్తువుయొక్క భక్తులము. పాశ్చాత్యులు శరీరోపాసకులు, మనము ఆత్మోపాసకులము. పాశ్చాత్యులు నామరూప

మునం దనురక్తులు. మనము నిత్యవస్తువును బడయనిచో ఏవిధముగను సంతుష్టులము కాఁజాలము. ఈ భేదము ధర్మమందు, దర్శనమందు, సాహిత్యమం దెట్లో, అట్లే చిత్రవిద్యయందును, స్థాపత్యవిద్యయందును, అన్ని చోట్లను వ్యక్తమగుచున్నది.

---

